తెలుగు మాస పత్రికకు

అన్నిగ్రామాలలోనూ, పట్టణాలలోనూ

సమర్థవంతులైన ఏజంట్లు కావాలి!

ఏజన్సీ వివరాలకు

వెంటనే వ్రాయండి.

9, దేశికా రోడ్డు, మైలాపూరు,

మద్రాసు - 600004.

విస్డమ్

అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాసపత్రిక

సంపాదకవర్గం

సంపాదకుడు:

లయన్ కె.వి. గోవిందరావు బి.ఏ., ఎల్.ఎల్.బి.,

గౌరవ సహాయ సంపాదకులు:

టి.ఎల్.ఎన్.రావు బి.ఎస్సి.,

వి. బాలకుమార్ ఎమ్.ఏ., బి.ఎడ్.,

సభ్యులు:

కె.వి.ఎస్. గోవిందరావు బి.ఏ., ఎల్.ఎల్.బి.,

కె.వి.ఎస్. శరత్‌బాబు బి.ఏ., బి.కాం., బి.ఎడ్.,

కె.వి.ఎస్. విజయకుమార్

కె. రత్నకుమారి




## ఈ సంచికలో

ఫిబ్రవరి 1987





ముఖచిత్రం :

"భిన్నత్వంలో ఏకత్వం"

తెలుగు విస్డమ్‌కు ఇది ఆరవ సంవత్సరం

# ప్రేమ సాధన




ప్రేమ అంటే వట్టి మోహం అనుకున్నావా? కాదు. అనంతమైన నిర్లిప్తానందానుభూతిని కలిగించే ఆధ్యాత్మికానురాగం ఈ ప్రేమ. ఇదే నిస్వార్థమైన ప్రేమ. అనిర్వచనీయమైన ఈ ప్రేమను శుష్కతర్కంతో నిర్వచించలేవు. అమూల్యమైన నీ మనస్సులో తీవ్ర సాధనవల్ల మాత్రమే ఇది సాధ్యం. అట్టి అవ్యాజ ప్రేమతో ఐక్యం తెచ్చుకో. ప్రేమమూర్తివి అయిపోతావు. అప్పుడు నీవు పొందే ఆనందానుభూతిని ఇదమిద్ధని నిర్ణయించలేవు.

సంస్కార కౌశలంతో అంతటి మహోన్నత భావాన్ని పొందినప్పుడు నిన్నెవరు విడిచిపెడతారు? సర్వజనుల ఆదరాన్ని చూరగొంటావు. మనస్సులో పరితాపం ఉండదు ఆవేదన ఉండదు. అనంతమైన శక్తి నీలో ఉద్భవిస్తుంది. ఇదే నిన్ను నీవు ప్రకాశింపజేసుకునే శక్తి. ఆత్మ శక్తి.

(మిగతా 3 వ పేజీలో)

## సంపాదకుని పేజీ

# మంచి చేయకపోవ మహా పాపం

ఏ పనీ చేయకుండా ఊరికే కూర్చోవడం గ్రుడ్లు పొదగడంతప్ప ఇంకోపని కాదు. గ్రుడ్లు పొదగడం కోడిపెట్టలపని. కాని మానవులు నిర్వ్యాపారంగా కూర్చుని జీవితంలో ఏ సత్కార్యాలను సాధించలేరు; సత్ఫలితాలను పొందలేరు. కర్మ సత్యప్రతిష్ఠితమై అనన్య భక్తితో ఆచరిస్తే కర్మకుశలుడవు అవుతావు. ఇటువంటి కర్మకుశలత్వంవల్ల దేహారోగ్యం కలుగుతుంది. ప్రాణానికి సుఖం కలుగుతుంది. మనస్సుకు శాంతి ఏర్పడుతుంది. ఇవన్నీ సక్రమంగా సమకూడినప్పుడే నీ జీవితం చరితార్థమవుతుంది.

సత్కర్మ లాచరించడం వల్ల చిత్తశుద్ధి కలుగుతుంది. చిత్తశుద్ధి శుష్కకర్మవల్ల సాధ్యంకాదు. ఈ లోకంలో ఏ పనీగూడా దానంతటది జరుగదు. మరియొకరి ప్రవర్తన వల్లే అది కలుగుతుంది. చరితార్థ పురుషుల దివ్యజీవితాలను చదివి విజయవంతులైన వారి విజయసాధనలను పరిశీలించు. పెద్దల జీవితాలను పరిశీలించి నీ విలువను మదింపు చేసుకో.

## ప్రపంచానికి ఆసరా!

వివేకవంతుల విజ్ఞానం;
మహాత్ముల న్యాయం;
ధైర్యవంతుల పరాక్రమం;
ధర్మాత్ముల ప్రార్థన.

మహమ్మదు ప్రవక్త

“ఉపక్రమించటానికి ముందేకాదు
ఉపక్రమించిన తరువాతకూడా యోచించు.

—వినోబాభావే

ప్రపంచంలో ఏ పనీ అనుకున్నంత సులభంకాదు. జ్ఞానదగ్ధమైన కర్మ చిత్తశుద్ధి సాధకం. హిమాలయ పర్వతశిఖరాలలో ఎవరెస్ట్ శిఖరంగానీ, మరో శిఖరంగానీ ఎక్కడం సులభసాధ్యమా? కష్టపడి ప్రయత్నించి ఒక అడుగు క్రిందికి జారుతూ రెండు అడుగులు పైకి ఎగబ్రాకే వాళ్ళకే ఇది సాధ్యం.

రాజకీయాలలో రాజకీయనాయకులు తమ పాత్రలను సక్రమంగా నెరవేర్చుకోకపోతే ఎవరిది తప్పు? వాళ్ళకు వోటు వేసి ఎందుకు ఎన్నుకున్నారు? ఒక పెద్ద కర్మాగారంలో కార్మికుడు తన సంఘాన్ని గూర్చి విమర్శిస్తే తానెంత కార్యనిరతితో ఉన్నాడో అడుగు. ఎన్నిసాకులు, ఎన్ని అబద్ధాలు చెబుతాడో గమనించు. రాజ్యాంగంలో వివిధ రంగాలలో ప్రతీ కుటుంబ సభ్యుడూ అభివృద్ధికి పాటుపడాలి. అప్పుడు విద్యావిధానాలు, శ్రామిక సంబంధాలు, సాహిత్యరంగం, కళారంగం ఎటువంటి అభివృద్ధితో రంజిల్లుతాయో గమనించు.

ఎప్పుడూ 'నేను అపకారం చేయను' అనకు. దీంట్లో మంచి చేయడానికి బదులు 'చెడును తప్పించుకోడం' గోచరిస్తుంది.

## భారతదేశపు పసిపిల్లలలో 17 శాతం చెవిటివారు

భారతదేశంలో పసిపిల్లలలో 17 శాతం మందికి చెవుడు. ఇది మధ్య చెవిలో కలిగే ఓటైటిస్ మీడియా (Otitis Media) అనే అంటురోగంవల్ల సంభవిస్తుంది.

పెద్ద పెద్ద నేరాలు చేయడం కాదు. ఒకరికి చేయగలగిన మంచిని చేయకపోవడమే మహాపాపమని ఫ్రెంచి నవలా రచయిత లియాన్ బ్లాయ్ అన్నాడు.

ప్రతీ వ్యక్తి మంచికోసం తపనపడుతూ పవిత్రమైన జీవనంకోసం ఆరాటపడాలి. భగవంతుడు ప్రసాదించిన దివ్యశక్తి సామర్థ్యాలను వినియోగించుకుంటూ ప్రవృద్ధిని కలిగించుకోక పోవడంవల్ల మానవత్వం నశించిపోతుంది. లోకంలో ప్రతి ఒక్కరూ తమలో దివ్య జ్యోతిని వెలిగించి ప్రకాశింపకోగల శక్తిని తెలుసుకుంటే ప్రపంచంలో ఉత్తమ మార్గ ప్రగతికి బాట వేసిన వారు అవుతారు. దైనందిన జీవితంలో ఆధ్యాత్మిక, శారీరక, మానసిక శక్తులను సాధకం చేసుకున్నప్పుడే నీవు జీవితాన్ని సార్థకం చేసుకుంటావు. ఇవే విమోచనానికి, దివ్య జీవనానికి రహదారులు.

( 2 వ పేజీ తరువాయి)

ఇటువంటి ప్రేమశక్తిని అభ్యాసం చేసుకుంటే నీ జీవితమంతా సుఖమయమే కర్మకుశలుడవు అవుతావు. లోకకల్యాణానికి సూత్రం కనిపెట్టిన వాడవు అవుతావు.

సంనియమంతో, నిస్వార్థమైన నిర్లిప్త ప్రేమతో ప్రగతి మార్గంలో ముందుకు సాగిపోతావు. విజ్ఞాన జ్యోతిని దేదీప్యమానం చేసుకోగలుగుతావు. నీ శరీరం నీ స్వాధీనం అయిపోతుంది. నీ మనస్సు నీ స్వాధీనం అయిపోతుంది. పరిపూర్ణమైన తన్మయత్వంతో ఇక భయభ్రాంతులకు తావుండదు.

"ఔదార్యానికైనా ఔచిత్యం ఉండాలి."

# శ్రీ శంకర భగవత్పాదులు

టి. రామలింగేశ్వరరావు

భారతీయ 'తత్త్వ-చింతన'యొక్క ప్రాచీన సాంప్రదాయాన్ని పునరుద్ధరించి దానికి అద్వైత సిద్ధాంతమే పరమ ప్రమాణమని స్థాపించిన మహాత్ముడు, జగద్గురువు శ్రీ శంకరాచార్యులు. వీరే శంకరులు, శంకర భగవత్పాదులు. వీరి తరువాతే మధ్వాచార్యులు ద్వైత సిద్ధాంతాన్ని. శ్రీరామానుజులు విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. భారతీయ సమాజంలో భారతీయ సంస్కృ



తిని చిరస్థాయిగా నెలకొల్పిన ప్రతిభాశాలి; బహుముఖ ప్రజ్ఞావంతుడు శంకరుడు.

778 ఎ.డి.లో కేరళదేశం పెరియారు నదిగట్టున కాలడి అనే గ్రామంలో శంకరుడు జన్మించాడు. తల్లి ఆర్యాంబ. తండ్రి శివగురు. వీరు నంబూదిరి బ్రాహ్మణులు. శివగురు ఆర్యాంబ దంపతులు గొప్ప శైవభక్తులు. వీరికి పరమేశ్వరుని వరప్రసాదము వలన జన్మించిన ఏకైక పుత్రరత్నము శంకరుడు. శంకరుని బాల్యమందే తండ్రి శివగురు పరమపదించాడు. బాలుని పోషణ, విద్యా బాధ్యత పూర్తిగా తల్లి మీద పడింది. బాలుడైన శంకరుడు 5 వ సం. రం వయస్సులో గురుకులంలో చేరాడు. 8 సం.ల వయస్సుకే సకల శాస్త్రాలలోను అఖండ ప్రావీణ్యతను సంపాదించి బాల మేధావి అనిపించుకున్నాడు శంకరుడు. శంకరుడు ఇంటికి తిరిగివచ్చి పూజ్యురాలైన తల్లికి సేవలు చేస్తూ విద్యార్థులకు జ్ఞానబోధ చేస్తూండేవాడు.

హైందవ ధర్మం నశించిపోకుండా చిరకాలం వర్ధిల్లడానికి అనేక సంస్కరణలతో చైతన్యవంతంచేసి తిరిగి స్థాపించాలనే

## 'విస్‌డమ్' పాత కాపీలు

మార్చి '82; ఫిబ్రవరి '83, మార్చి '83; మార్చి '84 నుంచీ జూన్ '84; ఆగస్టు '84 నుంచీ నవంబరు '84; జనవరి '85 నుంచీ అక్టోబరు '85; జనవరి '86 నుంచీ జూన్ '86 కాపీలు మా వద్ద ఉన్నవి. '82 కాపీ వెల. పై 0.75 లు; 1983 కాపీల వెల. రూ. 1-75 లు; 1984 కాపీల వెల రూ. 10-00 లు; 1985 కాపీల వెల రూ. 12-50 లు; 1986 కాపీల వెల రూ. 8.75 లు. రిజిస్టర్డ్ పోస్టులో పొందడానికి కాపీల వెలతో పాటు రూ. 4-50 చేర్చి M.O. పంపాలి. 'విస్‌డమ్' 9, దేశికారోడ్డు, మద్రాసు-600004.

—సర్క్యులేషన్ మేనేజర్.

మహోన్నత ఆశయంతో తల్లి అనుమతిని పొంది సన్న్యాసాన్ని స్వీకరించి ఒక గురువును అన్వేషిస్తూ బయలుదేరాడు. ఉత్తర దేశానికి వచ్చిన శంకరుడు నర్మదా నదీతీరాన గోవింద భగవత్పాదులనే గురువును ఆశ్రయించాడు. గురువు తన శిష్యునకు దివ్య సాక్షాత్కారానికి రహస్య మార్గాలు చెప్పి దీక్షనిచ్చి సద్గ్రంథాలను రచిస్తూ ఉపన్యాసాలను ఇస్తూ మానవలోకానికి జ్ఞాన భిక్షను పెట్టి ఉద్ధరించమని ఆదేశించాడు.

గురువుగారి ఆజ్ఞను శిరసావహించి వేదవ్యాసుడు రచించిన బ్రహ్మసూత్రాలు, ఉపనిషత్తులు,భగవద్గీతలను(ప్రస్థానత్రయం) సామాన్యులకు కూడా సుబోధక మగునట్లు వ్యాఖ్యానాలు (భాష్యాలు) వ్రాసాడు. వేదాంతం నేర్చుకోడానికి ఎందరెందరో ఉద్దండులు ఆయనవద్ద శిష్యులుగా చేరారు. రాకపోకలకు ఏమాత్రం సౌకర్యాలు లేని ఆనాడు 32 సం. ల వయసు దాటకుండా శ్రీ శంకరులు భారతదేశమంతటా మూడు సార్లు పర్యటించాడు.

నేటికీ భారతదేశం ఉత్తరభాగంలో, నేపాలులో వీరిని గౌరవించని వారుండరు. ఎక్కడో దక్షిణదేశంలో మారుమూలలో పుట్టి భారతదేశమంతటా ఆధ్యాత్మిక దిగ్విజయ యాత్రచేసి అద్వైత సిద్ధాంతాన్ని నెలకొల్పిన శంకరుడు దివ్యాంశ సంభూతుడైన కారణ జన్ముడు. జగద్విఖ్యాతి పొందిన పరిపూర్ణ మానవుడు.

మంచుతో కప్పబడిన గంభీరమైన హిమాలయ పర్వత శిఖరాలమీద బదరీనాథ్‌లో ప్రవహించే అలకనంద నదిలో బౌద్ధులు విసిరివేసిన బదరీనారాయణ విగ్రహాన్ని తిరిగి సంపాదించి బదరీనాథ్‌లో ప్రతిష్ఠచేసి పూజలు నిర్వహించాడు ఆనాడు శంకరుడు ఆదేశించిన మార్గంలోనే నేటికీ బదరీనాథ్‌లో నారాయణునికి పూజలు జరుగుతున్నాయి.

మాతృదేశం ఒక యజ్ఞవేదికగా గ్రహించి బదరీనాథ్ (ఉత్తరప్రదేశ్). పూరీ (ఒరిస్సా) శృంగేరీ (కర్ణాటక), ద్వారక (గుజరాత్) లలో — భారతదేశం నాలుగుమూలలా - పీఠాలను నెలకొల్పి ధర్మకేంద్రాలుగా నాలుగు మఠాలను స్థాపించాడు.

భారతదేశంలో వివిధ మతాలకు చెందిన

## మీరైతే...?

(డిసెంబర్

(చాలదనిపించే సమయం సార్థకం కావాలి అంటే?)

"ధనం కంటే క్షణం విలువైనదని గుర్తించి
అనుక్షణం శ్రమిస్తాను"

—బి. డి. సన్యాసమ్మ, కళింగపట్నం.

* * *

"సార్థకానికి అర్థం వెదికి
సౌహార్ద్రానికి నిచ్చెన వేస్తా!"

—పట్నాయకుని మోహన్‌దాస్, కొత్తూరు, (శ్రీకాకుళం జిల్లా)

* * *

"ముందుగా సమయం విలువ తెలుసుకుంటాను."

—కట్టోజు రఘురామ్, అజ్జరం, (ప.గో. జిల్లా)

వారు వివిధ విశ్వాసాలతో. విభిన్న అభిప్రాయాలతో వాద ప్రతివాదాలు జరుపుకుంటూండేవారు. శంకరుడు ఈ వైవిధ్యానికి ఐక్యతను రూపొందించి సంఘంలో దురాచారాలను రూపుమాపి ఇష్టదేవతా ప్రార్థనను నిర్ణయించి పూజా విధానంలో సమైక్యతను సాధించాడు. వివిధ మతాలవారికి ఆచరణ యోగ్యంగా వారి వారి ఇష్ట దేవతల మీద అపూర్వ స్తోత్రాలను రచించాడు. పరమాత్మని గూర్చి తెలుసుకోడానికి అన్ని మార్గాలు ప్రమాణమైనవే ననే దృఢనమ్మకం కలిగించి మానవులను విశ్వసింపజేశాడు. దివ్యసాక్షాత్కారానికి ఇవి సువర్ణ సోపానాలు మాత్రమే అని చెప్పి దేనిని నిర్లక్ష్యం చేయకూడదని నిర్దేశించాడు. ప్రతీ మతానికి స్వాభావికమైన అవధులు ఉన్నాయని దేనిని నిరాకరించకూడదని వివరించాడు. సాంప్రదాయ విరుద్ధముకాకుండా వేదాల ప్రామాణ్యతను తిరిగి స్థాపించాడు. ప్రత్యగాత్మ, అనంతాత్మ రెండూ ఒకటే అనే అద్వైత సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. జీవులందు మాయను తొలగించి శుద్ధ చైతన్యరూపంలో సర్వమునకునూ అభేదము ఋజువు చేయునదే అద్వైతము. ఆత్మ శుద్ధ చైతన్య రూపమనియు సర్వమునూ తెలుసుకొనునట్టి శక్తియై సర్వసాక్షి అనే సంకేతంతో ఉందని నిరూపించబడింది. జీవులందును తదితర వస్తువులందును భేదమును సాధించునట్టి నామ రూపాలు కల్పితాలని కాబట్టి అది మాయా మాత్రం అని నిర్ణయిస్తూ బ్రహ్మసత్యం, జగత్ మిధ్య అని సూక్ష్మంగా సామాన్య మానవునికి అతిసరళంగా సులభంగా తెలియజేసిన పరమగురువే శంకరాచార్యుడు—ఆదిశంకరుడు.

ప్రపంచం అస్థిత్వాన్ని నిరాకరించలేదు. మాయావాదాన్ని ఖండించాడు. సాపేక్షికంగా ప్రపంచం యదార్థమని, పరమాత్మ సంబంధంగా ఆభాసమని విశదీకరించాడు. పరమాత్ముడు సాపేక్షికంగా యధార్థమని బోధించాడు.

శంకరుడు తన అద్వైత సిద్ధాంతాలను అనుసరించమని ఎవరినీ బలవంతం చేయలేదు. సామాన్య మానవుడు తన ధర్మాన్ని అనుసరిస్తూ పరమాత్మను సాక్షాత్కరించుకోడానికి తరుణోపాయాన్ని చూపించాడు. భగవద్గీతను మొట్టమొదట ప్రమాణమైన ముఖ్య శాస్త్రంగా ప్రచారం చేసిన మహానుభావుడు శ్రీ శంకరుడు.

## యధార్థ జీవిత సంపదలు

వ్యక్తిగత జీవితాన్ని సౌభాగ్యం చేసే యధార్థ సంపత్తులు మూడు:

(1) బలిష్టమైన శారీరక ఆరోగ్యం, దృఢమైన మానసిక స్వస్థత కలిగి ఉండడం.

(2) విజ్ఞానాభివృద్ధికి అభిలాష, అవకాశం కలిగించుకోవడం.

(3) తోటి మానవ సంక్షేమానికి మానసిక శక్తిని సమర్థవంతంగా ఉపయోగించడం.

—ఎల్బర్ట్ ఎన్ కార్వెల్

"మనిషి మనీషిగా మారితే మనస్సులో మాలిన్యానికి చోటుఉండదు."

# వనితాలోకం

## గృహిణులకు సలహాలు

శ్రీమతి మంజూషా గార్గ్

**టంబ్లర్ జారకుండా ఉండాలంటే:**

వెడల్పాటి రబ్బరు బాండ్లను అమరిస్తే చిన్నపిల్లల చేతులలో నుంచి గ్లాసు జారి పడిపోదు.



**ఎండు పళ్ళను కోయడానికి కత్తి అంచుకు వెన్న పూయాలి:**

పళ్ళు, టొమాటోలు సరిసమానంగా కోయాలంటే బ్రెడ్ నైఫ్ ఉపయోగించండి. ఎండు పళ్ళు కోయడానికి మాత్రం కత్తి అంచుకు కొంచెం వెన్న పూస్తే సులభంగా కోయవచ్చు.

**సాగి వంగిపోయిన పేము కుర్చీలు బిగువు పొందాలంటే:**

పేము కుర్చీలు వదులుగా సాగిపోతే బాగా వేడినీళ్ళతో కడిగి ఎండలో ఎండ బెట్టండి. కుర్చీలు యధాప్రకారం బిగువుగా ఉంటాయి.

**స్పూను గాజుగ్లాసును పగలనీయదు:**

గ్లాసులో వేడిగా పాలగానీ, టీగానీ పోసేముందు ఒక స్పూను గ్లాసులో పెట్టండి. స్పూను ఉష్ణాన్ని గ్రహించడమే గాకుండా గాజుగ్లాసుని పగలకుండా ఉంచుతుంది.

**ఒక స్పూను వినిగర్ కలిపితే చాలు:**

ఏదైనా తయారుచేసుకోడానికి పులవ బెట్టిన పాలు కావాలంటే మామూలు పాలు ఒక కప్పుకి టేబిల్ స్పూన్ వినిగర్‌గానీ, నిమ్మరసం గానీ కలిపి 5 నిమిషాలు ఉంచి ఉపయోగించండి.

**మొక్కలకు నీరు అవసరమో కాదో తెలుసుకోడం:**

మొక్కల దగ్గరగా చుట్టూఉండే భూమిలో ఒక సూది గ్రుచ్చి తీసిచూడండి. సూదికి మన్ను అంటుకోకుండా ఉంటే నీళ్ళ అవసరం అన్నమాట. వెంటనే నీళ్ళు పోయాలి.

**రెండు గ్లాసులు ఒకదాంట్లో ఒకటి బిగుసుకుపోతే:**

ఒక దాంట్లో ఒకటి రెండు గ్లాసులు బిగుసుకుపోతే లోపలి గ్లాసులో చన్నీళ్ళు పోసి ఆ గ్లాసుల జతని వెచ్చని నీటిలో పెడితే లోపలి గ్లాసు సంకోచం పొందుతుంది. వెలుపలి గ్లాసు వ్యాకోచం పొందుతుంది. వెంటనే గ్లాసులు సులభంగా తీయవచ్చు.

(మిగతా 23 వ పేజీలో)

"నదులు సముద్రాభిముఖంగా ప్రవహించునట్లు ఏ పురుషుడు ఆత్మాభిముఖముగా పరుగిడునో వానికి అవిఛలశాంతి లభిస్తుంది." —గీత

# ఒంటె - కొన్ని అపూర్వ విషయాలు

జాన్ జె. దొరైరాజ్

సుమారు 50 మిలియను సంవత్సరాలకు పూర్వం ఉత్తర అమెరికాలో ఒంటెల కుటుంబం ప్రారంభమైంది. ఆ రోజులలో ఒంటె సాధారణ పిల్లి పరిమాణంలో ఉండేది. క్రీ.పూ. 3250-అంటే మానవజీవితం ప్రారంభం అయిన నాటినుండి మొట్టమొదట ఒంటె పెంచబడుతూ వచ్చింది.

ఒంటె శరీరంలో అందమైనభాగం కళ్ళు. దీని కళ్ళకు రెప్పలు జతలు జతలుగా



ఉంటాయి. ఎడారులలో ఎగిరే దుమ్ము, ఇసుక కళ్ళలో పడకుండా రక్షిస్తాయి ఈ రెప్పలు.

ఒంటె పెదిమలు గట్టి రబ్బరులా ఉంటాయి. అందుకే ఇవి ముళ్ళకొమ్మలను, రెమ్మలను కూడా తినగలుగుతున్నాయి. తడి ఆరిపోతుందనే భయంచేత ఒంటె ఎప్పుడూ పెదిమలను నాకదు. ఎంత ఆకలిగా ఉన్నా ఒంటె ఎప్పుడూ రాత్రిపూట ఏమీ తినదు. ఒంటె పది నిమిషాలలో 25 గ్యాలనుల నీటిని మింగేస్తుంది. ప్రయాణం చేస్తున్నప్పుడు ఒంటె నిశ్శబ్దంగా ఉంటుంది. ఒంటె జీవిత ప్రమాణం సుమారు 40 సంవత్సరాలు. తల్లి ఒంటె, ఆవుపాలకంటే శ్రేష్ఠమైన మంచి పాలు 4 లీటర్లు మూడు సంవత్సరాల పాటు ఇస్తుంది. ఒంటె 225 కి.గ్రా. భారంతో రోజుకు 40 కి.మీ.ల చొప్పున ఒకే సమంగా 3 రోజులు ప్రయాణం చేయగలదు. భారం మోయకుండా ఇది గంటకు 16 కి. మీ. చొప్పున 18 గంటలు పరుగెత్త గలదు.

ఒంటెనడక చాలా విచిత్రంగా ఉంటుంది. కుడిప్రక్క కాళ్ళు రెండూ ఒకేసారి ముందుకు పెట్టి తరువాత ఎడమ -ప్రక్క కాళ్ళు రెండూ ఒకేసారి ముందుకు పెట్టి ఇటుపక్క - అటుపక్క ఆడుతూ తూగుతూ నడుస్తుంది. అందుకే దానిని 'ఎడారి ఓడ' అన్నారు.

## 2101 వ సంవత్సరానికి జనాభా 10,189 మిలియను

సాలువారీ సగటు జనాభా పెరుగుదల 2.25 శాతం దగ్గర నిలకడగా ఉన్నా భారత దేశంలో 1981 వ సం. లో ఉన్న మొత్తం 685 మిలియను జనాభా 2001 వ సంవత్స రానికి 1,075 మిలియనుకి పెరుగుతుంది. 2101 వ సం.కి భారతదేశం జనాభా బ్రహ్మాండంగా 10,189 మిలియను స్థాయిని అందుకుంటుంది.

"అంతరంగ పరివర్తన చేసుకుంటే మానవుడు
తనకు తానే విమోచనం పొందగలడు."

# 10వ ఆసియా క్రీడలు

కొరియా రిపబ్లిక్ (దక్షిణ కొరియా) రాజధాని నగరం సియోల్‌లో 1986వ సంవత్సరం సెప్టెంబరు 20 నుండి అక్టోబరు 5వ తేదీవరకు నిర్వహింపబడిన 10వ ఆసియా క్రీడలు 1.4 మిలియనుకు పైగా ప్రేక్షకులను ఆకర్షించాయి. 73 మిలియను డాలర్ల వ్యయంతో నిర్మించబడిన ఒలింపిక్ స్టేడియంలో కన్నుల పండుగగా నిర్వహింపబడ్డ ఆటల పోటీలను 2,25,200 మంది ప్రేక్షకులు చూచి ఆనందించారు.



సియోల్‌లోను మరియు ఇతర నగరాలలోను మొత్తం 33 కేంద్రాలలో 269 ఆటల పోటీలలో క్రీడాకారులు పాల్గొన్నారు. మొత్తం 4,`00 మంది క్రీడాకారులు ఈ ఆసియా క్రీడలలో పాల్గొన్నారు. 269 స్వర్ణ పతకాలతో పాటు మొత్తం 848 పతకాలకు పోటీలు పడ్డారు. 'నిరంతర ప్రగతి' (Forever Onwords) అనేదే ఈ 10వ ఆసియా క్రీడల నినాదం.

10వ ఆసియా క్రీడలకు చిహ్నం కొరియాకు సంబంధించిన సాంప్రదాయక టిఎగుక్ (T'aeguk). 388 క్రీడాకారులను పంపిన చైనా టీము (నాల్గవ పెద్ద జట్టు) 94 బంగారు పతకాలను పొంది ఉత్సాహ పూరితమైన క్రీడా దేశంగా పేరుపొందింది. దక్షిణ కొరియాకు 93 బంగారు పతకాలు లభించాయి. ఆసియా పందాలలో 8 సార్లు విజయం సాధించిన జపాను 58 బంగారు పతకాలను దక్కించుకుంది.




భారతదేశం 5 బంగారు పతకాలను, 9 రజత పతకాలను, 23 కాంస్య పతకాలను గెలుచుకుంది. భారతదేశపు బాక్సరుల జట్టు అనుకున్నదానికంటే బాగా నైపుణ్యాన్ని, ప్రతిభను ప్రదర్శించి దక్షిణ కొరియా తరువాత 2వ స్థానాన్ని పొందింది.

20 కి. మీ.ల నడక పందెంలో చైనా సున్‌క్సియో గువాంగ్ (Sun Xiaoguang) గెలుచుకున్నాడు. చాంద్‌రామ్ మాత్రం కాంస్యపతకాన్ని గెలుచుకున్నాడు.

---

"మానవమాత్రులు తమ ఆశయాలను; అభిప్రాయాలను
మార్చుకుంటే జీవితాలను సౌలభ్యంగా మార్చుకోగలరు." —విలియం జేమ్స్

భారతదేశపు గజ ఈతగాడు స్టార్ స్విమ్మర్ కజాన్‌సింగ్ టోకాస్ 200 మీ. ల బటర్‌ఫ్లై ఈతలో రజత పతకాన్ని పొందాడు. స్వర్ణపతకం జపాను హిరోషి సాటోకు లభించింది. కలకత్తా నుంచి వచ్చిన సోమదత్త, మహిళలకు ప్రత్యేకంగా ఏర్పాటైన వ్యక్తిగత ఎయిర్ రైఫిల్ పందెంలో కాంస్య పతకాన్ని, స్మాల్-బోర్ రైఫిల్ పందెంలో రజత పతకాన్ని గెలుచుకుంది.

బాంగ్‌కాక్ ఏసియాడ్ పందాలలో స్వర్ణ పతకాన్ని సంపాదించుకున్న మిడిల్ హెవీ


P.T. USHA

వెయిట్‌లో కర్తార్ సింగ్ థిల్లాన్ స్వర్ణ పతకాన్ని పొందాడు.

భారతీయ వాలీబాల్ పురుషుల జట్టు జపానుజట్టును ఓడించింది. చివరగా భారత జట్టును చైనా జట్టు ఓడించింది. పురుషుల మరియు స్త్రీల హాకీ పందాలలో ఇద్దరు వరుసగా కాంస్య పతకాలను లభింపజేసుకున్నారు.

'పరుగులరాణి' పి.టి. ఉష 100, 200 మరియు 400 పరుగుల పందాలలోను, 400 మీటర్ల హర్డిల్స్‌లోను, 4 × 400 మీటర్ల రిలే పందెంలోను పాల్గొంది. ఉష మొత్తం 4 స్వర్ణపతకాలను గెలుచుకోగలిగింది. 200 మీ. ల పరుగు పందెంలోను, 400 మీ. ల పరుగు పందెంలోను స్వర్ణపతకాలను తెచ్చుకుంది. 400 మీటర్ల హర్డిల్స్ పందాన్ని 56.08 సెకండ్లలో పూర్తిచేసి రికార్డును స్థాపించింది. 100 మీటర్ల పందెంలో రజత పతకాన్ని తెచ్చుకుంది.


KARTAR SINGH

భారతీయ మహిళాజట్టుకు చెందిన వలసమ్మ, వందనరావు, షైనీ అబ్రహాం మరియు పి.టి. ఉష 4 × 400 మీటర్ల రిలే పందెంలో రికార్డు విజయం సాధించి భారత

## బృహత్ ప్రచారకులు

ప్రపంచంలో అమెరికాలోని ఎడ్వర్టైజింగ్ కౌన్సిల్ మిక్కిలి పెద్ద ప్రచారకులు. వివిధ ప్రచార సాధనాల సదుపాయాలతో ప్రజోపకారార్థం 1983 వ సం. లో వీరు సుమారు 600 మిలియను డాలర్లు వెచ్చించారు.

గమ్యస్థానం ఎదురుగా కనిపిస్తూనే ఉంటుంది, చేరటంమాత్రం దుర్లభం. [illegible] ప్రయత్నంలోనే ఆనందం ఉంటుంది." —మహాత్మాగాంధీ

దేశానికి బంగారు పతకాన్ని నిలబెట్టారు. మహిళలకు ప్రత్యేకంగా ఏర్పాటైన 3,000 మీ.ల పందెంలో సుమన్ రవాత్‌కు కాంస్య పతకం లభించింది.

మొత్తం 42 పోటీలలో 17 పోటీలను గెలుచుకున్న చైనాదే అగ్రస్థానం. మహిళలకై ఏర్పాటైన 100 మీటర్ల హర్డిల్స్ పందెంలో చైనాకు చెందిన చెన్ కెమీ విజయం పొందింది.

మహిళల 10 కి.మీ. ల నడక పందెంలో గువాన్‌ఫిన్గ్ (Guan Ping) విజయం



Khazan

సాధించింది. మహిళల 10,000 మీటర్ల పందెంలో వాంగ్‌క్సైటుంగ్ (Wang - Xiuting) క్రొత్త ఏసియా రికార్డును స్థాపించింది. లివింగ్ (Li Ning) నాలుగు స్వర్ణపతకాలను పొందింది. 15 సం. ల వయస్సుగల చెన్ క్యూటింగ్ మూడు స్వర్ణ పతకాలను గెలుచుకుంది. పురుషుల హైజంప్‌లో జూహూ జైన్‌హూ (Zhu - Jainhu) క్రొత్త రికార్డు స్థాపించాడు.

పురుషులకు ప్రత్యేకించిన టేబిల్ టెన్నిస్ సింగిల్స్ ఆటలో దక్షిణ కొరియాకు చెందిన యూ నామ్ క్యూ (Yoo Nam-kyu) గెలిచాడు. దక్షిణ కొరియా సౌదీ అరేబియాల మధ్య జరిగిన ఫుట్‌బాల్ ఫైనల్స్‌లో కొరియా 2-0 గోల్సుతో విజయాన్ని సాధించి స్వర్ణపతకాన్ని అందుకుంది. సియోల్ ఏషియాడ్ ఆటలలో ఫుట్‌బాల్ ఆట మిక్కిలి ఎక్కువ ఆదరణ పొందిన ఆట. పురుషుల 5,000 మీటర్ల పందెంలో కిమ్ ఆంగ్ యూన్ (Kim Ong Yoon) స్వర్ణపతకాన్ని అందు



Shiny Abraham

కున్నాడు. పురుషుల 70 మీటర్ల ఆర్చెరీ పందెంలో యాంగ్‌చాంగ్-హూన్ స్వర్ణపతకాన్ని గెలుచుకున్నాడు.

పురుషుల హాకీ ఆటలో కొరియా బంగారు పతకాన్ని చేజిక్కించుకుని ప్రపంచ ఛాంపియన్ షిప్‌ను నిలబెట్టుకుంది. 1.500 మీ.లు, 3 000 మీ.లు, 800 మీ.లు, పరుగుల పందాలలో 17 సంవత్సరాల విద్యార్థిని లిమ్ చున్-ఏ (Lim Chun-Ae) బంగారు పతకాలను పొందింది. బాక్సింగ్ పోటీలలో కొరియా

"భగవంతునికి అత్యంత సన్నిహితంగా చేర్చే పథం అతి దీర్ఘం,
సుశ్రావ్యమైన పాట పాడడానికి శిక్షణ అత్యంత క్లిష్టం."

మొత్తం 12 స్వర్ణపతకాలను గెలుచుకుంది. టేబిల్ టెన్నిస్ ఆటలో కొరియా చతురుడైన యూనామ్ క్యూ 10 వ ఆసియా క్రీడలలో అత్యధిక ప్రతిభావంతుడని ప్రసిద్ధి పొందాడు.

జపానుకు చెందిన షిగెనోబూ మ్యూరోఫిషీ (Shigenobu Murofishi) హేమర్ పందెంలో గెలుపొందాడు. పురుషుల 10,000 మీటర్ల ఫైనల్స్‌లో మాసనారీ షింటాకు గెలిచాడు. పురుషుల మరాథాన్ పందెంలో జపాను దేశానికి చెందిన టాకీయుకీ




నాకాయామా (Takeyuki Nakayama) ప్రపంచ రికార్డును స్థాపించాడు.

ఈతల పోటీలో 35 సంవత్సరాలలో మొదటిసారిగా మలేషియా పతకాన్ని సంపాదించుకుంది. 400 మీ. ల వ్యక్తిగత రిలేలో 14 సం.ల వయస్సుగల నూరాల్ హుడా అబ్దుల్లా కాంస్య పతకాన్ని పొందింది. మహిళల 200 మీటర్ల ఫ్రీస్టైల్‌లో కూడా ఈమె మరో కాంస్య పతకాన్ని గెలుచుకుంది.

ఫిలిప్పైన్‌కు చెందిన లిడియా డి వేగా 100 మీటర్ల పందెం గెలుచుకుని ఆసియాలో "అతి వేగవంతమైన మహిళ"అనే బిరుదును పొందింది. 400 మీటర్ల పురుషుల హర్డిల్స్‌ను బహరెయిన్‌కు చెందిన అహమ్మద్ హమ్మదా 49.31 సెకండ్లలో ముగించడం మరో అపూర్వ విషయం.

ఆటలో పాల్గొన్న క్రీడాకారుల సగటు వయస్సు 23.9 సం.లు. సగటు ఎత్తు 171.6 సెం.మీ.లు. సగటు బరువు 66.2 కి.గ్రా.లు.

పతకాలను గెలుచుకున్న విజయ వంతులకు 1,900 బొకెలను పంచిపెట్టారు. క్రీడల నిర్వహణదారులు ఈ బొకెలకు 1.14 మిలియను డాలర్లు వ్యయంచేసారు. ఈ ఆటలకు కోడక్ కంపెనీ సుమారు 60 కి.మీ.ల ఫిల్మును డెవలప్ చేసింది.

సియోల్‌లో నివసించే 10 మిలియను మంది ఉత్సాహ పూరితంగా 10 వ ఆసియా క్రీడోత్సవాలను విజయవంతం చేసారు.

## పాఠకుల అభిప్రాయాలు

"ధర్మానికి దారి చూపటమే తప్ప
అధర్మానికి అద్దం పట్టడంలో లేదు
గొప్ప
—తెంబూరుగావం, కొరసండ.
(గంజాం జిల్లా)

* * *

"అక్షరం అక్షరం కలిస్తే పదం
మనసు మనసు కలిస్తే స్నేహం."
—బి. ఎస్. వి. బి. రాజా,
జేకేపూర్, (ఒరిస్సా)

"కక్షకు కన్నులుండవు, చెడుకు చెవులుండవు."

# యాత్రాస్థలాలు

# కురుక్షేత్రము

## ఎస్. వై. ఖురైషి

సుదీర్ఘమైన చరిత్ర, దైవభక్తి, సంస్కృతి కలిసి పురాణ ప్రసిద్ధమైన కురుక్షేత్రానికి ఒక హర్యానారాష్ట్రంలోనే కాదు యావద్భారత దేశంలోను అద్వితీయమైన ప్రాముఖ్యత ఏర్పడింది. మహాభారత ఇతిహాసంలో ముఖ్యులైన కౌరవులు, పాండవులు వంశానికి చెందిన మూలపురుషుడు కురు మహారాజు యజ్ఞము చేయుట కొరకు ఈ క్షేత్రము



దున్నెనట. అందువలన దీనికి కురుక్షేత్ర మనుపేరు సార్థకమైనది. దీని వైశాల్యం సుమారు 48 క్రోసులు (ఒక క్రోసు రమారమి 3 కి మీ.లు). ఇది పెద్ద నగరంకాదు. చిన్న గ్రామంకాదు. స్థానేశ్వరం అసలు ఊరు.

మొట్టమొదట 'బ్రహ్మావర్తము', బ్రహ్మఋషిదేశం అని చెప్పబడే కురుక్షేత్రం సృష్టికర్త బ్రహ్మ నిర్మితమైనది. ఇది యుగయుగాలనుంచి అనేక లక్షలమందికి ఒక చైతన్యవంతమైన దివ్యక్షేత్రంగా పరిణమించింది. పుణ్యప్రదములైన సరస్వతి, వృషద్వతి నదీ తీరములందు నివాసము ఏర్పరచుకున్న ఆర్యులు ప్రపంచానికి మహోన్నతమైన వైదిక సంస్కృతిని సృష్టించి ప్రసాదించారు.

వాల్మీకి మహర్షి రామాయణ మహాకావ్యాన్ని సృష్టించిన ప్రదేశమిది. ఇక్కడే వేదవ్యాసుడు మహాభారత, భాగవత పురాణాది గ్రంథాలను రచింవాడు. మన్వాదుల ధర్మశాస్త్రం ఆవిర్భవించిన ప్రదేశమే ఇది. ఇదే పాణిని, పతంజల్యాదుల వ్యాకరణ శాస్త్రాలు, యోగా శాస్త్రాలు పుట్టిన పుణ్య

### భావపరిచయపోటీ

(డిసెంబర్ 1986)

"బిచ్చం అడుక్కోడానికి వికలాంగుడు.
"మద్యం పుచ్చుకోడానికి
సకలాంగుడు."

—వి. జగదీశ్, వరంగల్.

* * *

"అడిగినవారికి కాదనకిస్తే
దానం కాదది దాహం కొరకే."

—తిరుమల విజయకుమార్,
కరీంనగర్.

"రాహుకేతువులు సూర్యచంద్రులనే పట్టుకుంటారు.
ఇతర గ్రహాలను పట్టుకోరు."

ప్రదేశం. భట్టబాణుడు 'కాదంబరి' మహా కావ్యాన్ని రచించిన పుణ్యభూమి ఇదే. శ్రీకృష్ణ భగవానుడు పార్థసారథియై మహా భారత యుద్ధరంగంలో అర్జునునకు గీతోప దేశ మొనరించి పాండవులకు విజయం చేకూర్చిన దివ్య ప్రదేశ మిది. శ్రీకృష్ణుని ఆనాటి గీతోపదేశము నేటి యావత్ప్రపంచా నికి మార్గ దర్శకమై భారతదేశ ఆధ్యాత్మి కోన్నతిని చాటుచున్నది.

అనేకవేల సంవత్సరాల నుంచి ఈ దివ్య క్షేత్రంలో వైదిక నాగరికత ప్రవృద్ధి పొందుతూ వస్తూంది. కురుక్షేత్ర తీర్థం, తీర్థ విధులకు ప్రశస్తమైనదని శాస్త్రాలు తెలుపు



BRAHMSAROVAR TANK

తున్నాయి. శ్రీకృష్ణుడు, పాండవులు తీర్థ యాత్రలకు వెడలినప్పుడు సూర్యగ్రహణము వచ్చినదనియు అప్పుడు వారీ దివ్య తీర్థంలో తర్పణాలు విడిచారని పురాణగాథ. అందు వలననే ఈనాటికి భక్తకోటి సూర్యగ్రహణ సమయంలో ఈ తీర్థంలో స్నానాదులు కావించి వెయ్యి అశ్వమేధ యజ్ఞాలను ఆచరించిన పుణ్యాన్ని పొందగలమని విశ్వ సిస్తారు.

భారతదేశ చరిత్రలో కురుక్షేత్రం మహో న్నత స్థానాన్ని పొందింది. హర్షచక్రవర్తి మహా సామ్రాజ్యానికి కురుక్షేత్రంలో ఒక భాగమైన స్థానేశ్వరం ముఖ్యపట్టణం. 7 వ శతాబ్దంలో ఇచ్చటనుండే హర్షుడు ఐక్య భారతదేశాన్ని భావించి నెలకొల్పాడు. కురు క్షేత్ర మహా సౌభాగ్య సంపదలను చూచి మహమ్మదు గజనీ 1004 వ సం.లో దోచు కోడానికి దండెత్తి వచ్చాడు. ఆ తరువాత 150 సంవత్సరాల దీర్ఘకాల శాంతి సమ యంలో పునరభివృద్ధితో గత వైభవాన్ని చేకూర్చుకోగలిగింది. కాని 1191-92 సంవ త్సరాలలో స్థానేశ్వరం చుట్టుపట్ల రాజపుత్ర రాజైన పృథ్వీరాజు చౌహాన్‌కు, మహమ్మద్ గోరీకి అనేక యుద్ధాలు సంభవించాయి. స్థానేశ్వరం సంపద, సౌభాగ్యం నశించ డంతో దానికిగల రాజకీయ ప్రాముఖ్యత కూడా పోయింది. స్థానేశ్వరం శిక్కుల వశమైంది. చివరకు 1850వ సం.లో బ్రిటిషు ప్రభువుల చేతికి చిక్కింది.

భారతదేశం స్వాతంత్ర్యం సిద్ధించుకున్న తరువాత కురుక్షేత్రంయొక్క చారిత్రక, సాంస్కృతిక, ధార్మిక ప్రాముఖ్యతను గ్రహించి భారతీయ ప్రభుత్వంవారు పున రుద్ధరించుటకు అనేక కార్యక్రమాలను

**ముఖచిత్ర వ్యాఖ్య**

(డిసెంబర్

"పి వందించిన గానసుధ
మా పెదవులపై రామ కథ."
—ఎమ్. జితేందర్, జూపల్లి.

• • •

"మకుటంలేని మహారాజులు,
ఆ నాటి మహానుభావులు."
—ఎస్. కళ్యాణసుందర్, గుంటూరు.

"ప్రత్యక్షంగా చేకూరిన ఫలితాలను బట్టి సాధించిన ప్రగతిని సమీక్షించడానికి సాధ్యమవుతుంది."

చేపట్టారు. 1956 వ సంవత్సరంలో ఇచ్చట స్థాపింపబడిన సంస్కృత విశ్వవిద్యాలయం ఈనాడు హర్యానా పరిపూర్ణ విశ్వవిద్యాలయంగా ఏర్పడింది. ఇప్పుడుఇది కురుక్షేత్ర యూనివర్సిటీ అని చెప్పబడుచున్నది. కురుక్షేత్ర యూనివర్సిటీ వైశాల్యం సుమారు 700 ఎకరాలు

కురుక్షేత్రంలో యాత్రికులు దర్శించవలసిన ముఖ్యప్రదేశాలలో బ్రహ్మ సరోవరం ప్రధానమైనది. మహాభారత యుద్ధానికి పూర్వం కురుమహారాజు దీనిని త్రవ్వించెనని ప్రతీతి. సూర్యగ్రహణ సమయంలో యాత్రికులు దర్శించే మరియొక పుణ్యసరోవరం



BIRLAMANDIR (KURUKSHETRA)

సన్నిహిత్ సరోవరం. జ్యోతీశ్వర్ కురుక్షేత్రము వద్దగల గొప్ప పుణ్యక్షేత్రం. ఇక్కడే శ్రీకృష్ణుడు అర్జునునకు గీతోపదేశం చేసాడు.

ఇచ్చట షేక్ చెహ్లీ సమాధి మొగలుల హస్తకళా నైపుణ్యాన్ని చాటుతుంది. ఇది 40 (చెహ్లీ) రోజులు పాటు దీక్షగా "సూఫీ"లు ప్రాణాయామం చేసుకోడానికి ఔరంగజేబు నిర్మించాడు. అందుకే దీనికి షేక్ చెహ్లీ అనే పేరు సార్థకమైంది.

ఇచ్చట జె. కె. బిర్లా నిర్మించిన బిర్లా మందిర్, నగర సౌందర్యాన్ని ఇనుమడింపజేసే పాలరాతి దేవాలయం. ఇచ్చట దేవాలయానికి దగ్గరగా 'గీతోపదేశం'—పెద రథంపై కృష్ణార్జునులు ఆసీనులై రథానికి నాలుగు గుర్రాలు లాగుచున్నట్టు పూర్తిగా తెల్లటి పాలరాతితో చెక్కబడింది. భగవద్గీత యందలి 18 అధ్యాయాలలో ఒక్కొక్క శ్లోకం రథంమీద చెక్కబడి ఉంటుంది. ఇచ్చట 'కృష్ణాష్టమి' (జన్మాష్టమి) మహా వైభవంగా జరుగుతుంది.

## సుభాషితాలు

ఎన్ని భూములుగని యేపాటు పడినను
అంటపీక శని వెంట దిరుగు
భూమి క్రొత్తయైన భోక్తలు క్రొత్తలా?
విశ్వదాభిరామ వినుర వేమా!

[ఒక చోట కలిసి రాలేదని మరో చోట కలిసివస్తుందని భ్రాంతితో జనులు స్థలం మారుస్తారు. కాని శని వెంట వచ్చుచున్నప్పుడు ఎక్కడికి పోయినా ఒకటే. ప్రదేశం క్రొత్తయే కాని వ్యక్తి క్రొత్త కాదు.]

* * *

విన్న సుద్ది కొంత వినని సుద్దులు కొన్ని
వింత సుద్దు లెన్నొ వినగ జెప్పు
దాను గన్న యట్లె దాంభికు డెప్పుడు
విశ్వదాభిరామ వినుర వేమా!

[విన్నవి కొన్ని, విననవి కొన్ని, వింతయైనవి కొన్ని, కల్పించి దాంభికుడు ఎరిగినట్లే నటించి నీతులు చెప్పును.]

## బైరన్ మెదడు బరువు

ప్రసిద్ధ ఆంగ్ల కవి బైరన్ మెదడు బరువు 82.25 ఔన్సులు. అతడి మరణానంతరం ఇది కనుగొనబడింది.

"మృగరాజైన సింహం మదపుటేనుగు కుంభస్థలంమీదకే విజృంభిస్తుంది కాని బక్కచిక్కిన నక్క చేజిక్కినా పైబడదు."

# జీన్స్ కథ

పి. కె. సెన్

**1850** వ సంవత్సరంలో కాలిఫోర్నియా (అమెరికా) లో ప్రజలు బంగారంకోసం తండోపతండాలుగా వచ్చి వలసలు ఏర్పరచుకుంటున్న రోజులలో బవేరియాకు చెందిన 'లెవిస్ట్రాస్' (Levi Strauss) అనే 20 సంవత్సరాల వయసుగల యువకుడు గుడారాలు వేసుకోడానికి దళసరిరకం కాన్వాస్ అమ్మకం ప్రారంభించాడు. కానీ గనులలో పనిచేసేవారు ఈ కాన్వాసును ఉపయోగించడం లేదని తెలుసుకుని దాన్నే అందరికీ బాగా మన్నే దళసరి పంట్లాములుగా మార్చేసాడు. ఆనాటి నుంచి లెవీజీన్స్ ప్రారంభమయ్యాయి.



దీనికి ఏర్పడిన గిరాకీని కనిపెట్టి వెంటనే స్ట్రాస్ 1860 వ సం.లో కాన్వాసుకు బదులు నీలిరంగు 'డెనైమ్'ను ఉపయోగించాడు. ఇది మొదట ఫ్రాన్స్‌లో నైమ్స్‌నుండి దిగుమతి కావింపబడేది. కాబట్టి దీనికి డెనైమ్స్ (De Nimes) అనే పేరు సార్థకమైంది. దీంతో తయారైన బట్టల రంగు దిగవని తీసిపోవని, ముడతలు పడిపోవని గ్యారంటీని ఇచ్చాడు. వెంటనే దీనికి అమ్మకాలు ముమ్మరంగా సాగాయి. అనేక మిలియను డాలర్ల వ్యాపారం చేసాడు. అమెరికాలో జీన్స్ సర్వసాధారణంగా అందరూ వాడడం ప్రారంభించారు.

రెండవ ప్రపంచ సంగ్రామ కాలంలో నావికులందరూ మామూలు బట్టలకు బదులు ఈ జీన్స్ ఉపయోగించడం మొదలుపెట్టారు. యుద్ధానంతరం మాజీ సైనికులు వీటిని ధరించి యూనివర్సిటీలో చేరారు. ఈవిధంగా విద్యార్థిలోకంలో అందరూ ఈ డెనైమ్‌ను వాడడం ప్రారంభించారు. క్రమక్రమంగా ప్రపంచం అంతటా విద్యార్థులు దీనికి ఎక్కువ మక్కువ చూపించారు. దీనికి ప్రచారం ఎక్కువ అయింది.

## స్పెయిన్‌లో కొలంబస్ వృక్షం

పశ్చిమ యూరప్ స్పెయిన్ సెవిల్లీలో అమెరికాను కనిపెట్టిన క్రిష్టఫర్ కొలంబస్ కుమారుడు క్రిష్టఫర్ ఫెర్నాండో నివసించిన భవన ఆవరణలో కొలంబస్ వృక్షం ఇంకా అలాగే పెరుగుతూంది. ఇది కొలంబస్ స్వంతంగా 1493 వ సం.లో అమెరికా నుండి తీసుకువచ్చి నాటిన మొక్క.

"ఈ శరీరమునకే క్షేత్రమనిపేరు, ఈక్షేత్రము నెవరు తెలుసుకొనునో వాడే క్షేత్రజ్ఞుడు."

—గీత

# మానవ పరిణామంలో శిరోజాలు

రాఘవేంద్రరావు

ప్రపంచంలో వివిధ జాతులకు, ఒకేజాతిలో వివిధ వ్యక్తులకు, ఒకే వ్యక్తి శరీరం మీద వివిధ భాగాలకు వెంట్రుకలు—వాటి మాదిరి, విన్యాసము, వర్ణము, పొడవును బట్టి అనేకరకాలుగా ఉంటాయి.

ఒక ఆరోగ్యవంతుడైన మానవుని శిరస్సు మీద 1,00,000 వెంట్రుకలుంటాయి. అవి



ఒక్కొక్కటి రోజుకి 0.35 మిల్లీమీటర్లు పెరుగుతూంటాయి. వయస్సునుబట్టి, పురుష స్త్రీ లింగభేదములను బట్టి వెంట్రుకల పెరుగుదల ప్రమాణం మారుతూంటుంది సాధారణంగా 15 మరియు 30 సం. ల వయస్సు మధ్య జుత్తు చాలా శీఘ్రంగా పెరుగుతుంది.

వాతావరణం కొంచెం ఉష్ణంగా ఉన్నప్పుడు వెంట్రుకలు అతిశీఘ్రంగా పెరుగుతాయి. పెరుగుతూన్న వెంట్రుకలను క్రమంగా కత్తిరిస్తూండటం వల్లగానీ. పూర్తిగా తీసివేస్తూండటం వల్లగాని వాటి ఘగతి పొందుతుందనేది నమ్మదగిన విషయంకాదు. రోజుకు 50 మొదలు 100 వెంట్రుకలు రాలి పోతూన్నా భయపడవలసిన ప్రమాదం లేదు. ఈపాటి వెంట్రుకలు ఊడిపోవడం సర్వ సామాన్యం. చాలా బలిష్ఠమైన జుత్తు మంగోలియా జాతివారి జుత్తు. ఒక వెంట్రుక తెగిపోకుండా 160 గ్రాముల భారాన్ని మోస్తుంది మరో అద్భుత విషయం. వెంట్రుకలు ఎంత కాలమైనా నశించిపోవు. 3,000 సంవత్సరాల తరువాతకూడా చెడిపోకుండా ఎంబామ్‌చేసి భద్రపరచబడిన ఈజిప్టు 2వ రెమిసెస్ తల వెంట్రుకలు నేటికీ ఎంతమాత్రం చెడిపోయిన సూచనలు కనిపించలేదు. చెక్కుచెదరకుండా ఉన్నాయి.

శిరోజాలు దట్టంగా ఉన్నవారు పలుచగా ఉన్నవారికంటే ఎక్కువ బలిష్ఠమైనవారు, వీర్య వంతులు అనేదానికి ఆధారాలు కనిపించడం లేదు. కాని సమృద్ధిగా వెంట్రుకలుండటం పురుష లక్షణమనే నమ్మిక ఇంకా జనబాహుళ్యంలో ఉంది. పురుషత్వం లోపించడంవల్ల బట్టతలలు పెరుగుతున్నాయనేది సరికాదని ఆధునిక వైద్యవిజ్ఞాన పరిశోధనలు

## భారతదేశంలో మొదటి వర్ణచిత్రం

భారతదేశంలో వర్ణచిత్రం తీయడానికి మొదట 1932వ సం.లో మదన్ థియేటర్స్‌వారు ప్రయత్నించారు. ఆ చిత్రం పేరు 'బిల్వమంగళ్'.

'సమరావేశాలు లేని సామరస్య వాతావరణంలో సహకారప్రగతి సాధ్యం."

బుజావు చేస్తున్నాయి. ముఖ్యంగా పురుషత్వం అధికమైనప్పుడే బట్టతలలు ఏర్పడుతున్నాయని నిర్ధారణ చేశారు. పురుష సంబంధమైన అండ్రోజెన్స్ (Androgens) అత్యధికంగా ఉత్పాదింపబడినప్పుడు పురుషులకు బట్టతలలు ఏర్పడుతున్నాయి.

ఎర్రజుత్తుగల వారికి, నల్లటి జుత్తుగల వారికి, జుత్తు లేనివారికి మంచి విశిష్టమైన మగతనం, అనుకోడం కూడా పొరపాటే. అరబ్బుల నిగనిగలాడే నిడుపాటి శిరోజాల కంటే చుబుకద్వయం స్త్రీలకు ఎక్కువ అందం అని అభిమానిస్తారు. ఆస్ట్రేలియా



ఆదిమవాసులు, స్త్రీలు ఎంత లావుగా ఉంటే అంత అందంగా ఉంటారని నమ్ముతారు. హెంటొటాట్స్, బుష్‌మెన్ జాతులలో ఆడవారికి పెద్ద నితంబాలు ఎంతో అందం. సౌందర్య పోటీలలో ఈ పెద్ద నితంబాలవారే విజయాన్ని పొందగలరంటే సందేహంలేదు.

ప్రపంచం అంతటా సౌందర్యానికి కళ్ళ తరువాత జుట్టు ప్రాముఖ్యత అని అనేక సుప్రసిద్ధ గ్రంథాలలో రచయితలు, సౌందర్యప్రియులు చెప్పిన అన్వయాలు ఉన్నాయి. ఆంగ్లేయభాషలో జుత్తుమీద అలెగాండర్ పోప్ రచించిన 'రేప్ ఆఫ్ ది లాక్'' (Rape of the lock) మిక్కిలి ప్రశస్తమైన కావ్యము. ఇది కల్పితం కాదు. యథార్థంగా జరిగిన సంఘటన. ఆనాడు సౌందర్యరాసి అనిపించుకున్న మిస్ ఆరాబెల్లా (Arabella) శిరోజాన్ని లార్డ్ పెట్రీ (Lord Petre) బలవంతిగా పీకుతాడు. దాంతో రెండు కుటుంబాలకు కలతలు ఏర్పడి జన్మవైరం పరిణమిస్తుంది.

ఒకరి జీవితకాలంలో అసలు కత్తిరించకుండా ఉంటే ఒక వెంట్రుక 55 మొదలు 70 సెం.మీ. లు పెరుగుతుంది. సాధారణంగా పురుషులకంటే స్త్రీలకే దీర్ఘమైన శిరోజాలు పెరిగినా, స్వామి పండార సన్నిధి అను స్వామి 26 అడుగుల పొడవైన జుట్టుగలవాడని 1949 వ సం.లో టొరాంటో మార్నింగ్ స్టార్ ప్రచురించింది.

ఈనాడు మానవుడు ఎక్కువ మెదడుతో తక్కువ శిరోజాలతో పొందిన పరిణామానికి సుమారు 3 బిలియను సంవత్సరాలు పట్టింది. కొంతమంది జీవశాస్త్ర నిపుణుల ప్రకారం ఇక రాబోయే మన సంతతివారికి రానురాను ఎక్కువగా బట్టతలలు ఏర్పడినా, విజ్ఞానాభివృద్ధి వల్ల, శాస్త్రాభివృద్ధివల్ల, సూక్ష్మకణాభివృద్ధివల్ల నల్లగా నిగనిగలాడే నిడుపాటి శిరోజాలతో పుట్టుకలను నియంత్రించవచ్చు.

## ఫిలాన్త్రోఫిస్టు?

లోకోపకారి అంటే ఆంగ్లేయభాషలో 'ఫిలాన్త్రోఫిస్టు' - అధికంగా దాన ధర్మాలు చేసేవాడు. ఫిలాస్ (ప్రీతిగల) ఆన్త్రోపాస్ (మానవుడు) అనే రెండు గ్రీకు మాటల నుండి ఫిలాన్త్రోఫిస్టు అనే పదం ఏర్పడింది

"కార్యరూపం ధరించని సత్సంకల్పాలు స్వప్నసౌధాలు."

# బహుమతి పొందిన వ్యాసం

## మానవీయత-జంతు సంక్షేమం

పి. ఆదిలక్ష్మి, గుంటూరు.

జంతువులు. వృక్షాలు ఆధారం చేసుకుని జీవించడం నేర్చుకున్న మానవుడు నేడు వాటిని అతి నిర్దాక్షిణ్యంగా అంతం చేస్తున్నాడు. మానవుడు స్వార్థ దృష్టితో వ్యాపారం కోసంగానీ, మాంసంకోసంగానీ అనేక విధాలుగా జంతుమారణ హోమానికి కంకణం కట్టుకున్నాడు. పర్వత సానువులలో అడవులలో నివసించే అనేక జంతువులు మానవుని దౌష్ట్యానికి బలిఅయిపోతున్నాయి. అడవి ప్రాంతాలలో నివసించే గ్రామస్థులకు పంటపొలాల సంరక్షణకు తుపాకులను ఉపయోగించుకోడానికి ప్రభుత్వం అనుమతించింది. వాళ్ళు చట్టాన్ని దుర్వినియోగ పరుస్తూ అనేక జంతువులను నిర్దాక్షిణ్యంగా వేటాడుతున్నారు.

కొందరు ఎలుగుబంట్లను పట్టి మృదువైన వాటి ముక్కు రంధ్రాలకు త్రాళ్ళుగట్టి వాటిచే ఆటలు ఆడించి డబ్బు సంపాదించుకుంటారు. అమాయక జీవుల బాధను అర్థం చేసుకోలేనంత దుర్మార్గంగా వ్యవహరిస్తున్నాడు మనిషి. కొన్ని రకాల గొర్రెపిల్లల్ని పుట్టిన కొద్దిగంటలకే చంపి వాటి చర్మాన్ని టోపీలు మొదలైన విలాస వస్తువులకు వాడుతున్నారు. ఎవ్వరికీ అపకారం చేయకుండా ఎత్తైన పర్వతప్రాంతాలలో ప్రశాంతంగా జీవించే అపురూపమైన కస్తూరీ మృగాలను చంపి ఫ్రెంచి, జపాను దేశాలకు అత్తరువంటి సుగంధద్రవ్యాలను ఎగుమతి చేస్తున్నారు. కప్ప కాళ్ళు, పాము చర్మాలు ఎగుమతులకు నిర్దాక్షిణ్యంగా మానవుడు ఈ కప్పలను, పాములను చంపుతున్నాడు.

సృష్టిలో శత్రుత్వంలోగానీ, మిత్రత్వంలోగానీ ఒకదానిపై ఒకటి ఆధారపడి పరస్పర సహజీవనం చేసే జంతువుల సంబంధాలు నశించిపోయాయి. మానవుడు తన ఇష్టం వచ్చినట్లు వివేకరహితంగా ప్రకృతి పద్ధతికి భంగం కలిగిస్తే తీవ్రంగా నష్టపోయేది మానవుడే. మానవ మనస్తత్వంలో మార్పు రావాలి. మానవతను పెంచుకోవాలి.

అంతరిక్ష పరిశోధనలకు కోతులను ఎగుమతి చేయడాన్ని నిషేధించిన మన మొరార్జీ దేశాయ్ యావత్ప్రపంచం చేత అభినందించబడ్డాడు

అనేకరకాల జంతువులు మానవోన్నతికి అనేక విధాలుగా పరోక్షంగా సహకరిస్తున్నాయి. తనస్వప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకుని మానవుడు జంతుసంక్షేమానికి కృషిచేసితీరాలి.

కుమారి సి. అపర్ణ, తెనాలి.

ఆదిలో మనిషి జంతువులనుంచి పరిణామ క్రమంలో ఏర్పడి జంతువుతో సమానంగా మెలిగినా, జంతువులన్నీ ఏదో ఒక విధంగా మానవునికి తోడ్పడుతూనే

"జపతపాదులచే నిత్యజీవితం నిండినప్పుడే ఆనందానుభూతి కలుగుతుంది."

ఉన్నాయి. కుక్కలాంటివి విశ్వాసం ప్రకటిస్తే గుర్రాలు వాహనాలుగా ఉపయోగపడ్డాయి. గేదెలు, ఆవులు పాలిస్తూంటే, ఒంటెలు, గాడిదలు సరకుల రవాణాకు ఉపయోగపడు తున్నాయి. పునుగుపిల్లి, కస్తూరీ మృగం సువాసన ద్రవ్యాలను ఇస్తూండగా, ముంగిసలు, పిల్లులు పాములనుంచి, ఎలుకల నుండి మనిషికి రక్షణను కలిగిస్తున్నాయి. క్రూరమృగాలు లేకపోతే మానవ సంతతి కన్నా జంతు సంతతే ఎక్కువగా ఉండే దేమో? కాకులు, రాబందులు, పందులు లేక పోతే భూతలమంతా దుర్గంధ భూయిష్టంగా ఉండేదేమో! మనుష్యులందరూ శాకాహారు లైతే జంతువుల సంఖ్య పెరిగిపోయి ఉండేది. బుద్ధి తెలిసిన మనిషి ఏ విధంగా జంతువులమీద ఆధారపడి ఉన్నాడో, బుద్ధి తెలియని జంతువులుకూడా అదేవిధంగా మనుష్యునిమీదే ఆధారపడి ఉన్నాయి. అదే ప్రకృతి సామరస్యం. వన్యప్రాణులను, జంతువులను రక్షించుకోలేకపోతే మానవ జీవితం దుర్భరమయ్యే అవకాశాలు పెరిగి పోతాయి. విచక్షణా రహితంగా వేటలని, క్రీడలని, వ్యాపారమని మనిషి జంతువులను సంహరిస్తున్నాడు.

'సర్వప్రాణులలోను నేనే ఉన్నాను' అని భగవద్గీతలో చెప్పబడింది. పక్షుల జంటను విడగొట్టిన వాల్మీకి శోకం శ్లోక మయమై, రామాయణంగా రూపొందింది. జీవకారుణ్యం యొక్క ఆవశ్యకతను తెలిసిన మహనీయులు భూతదయను ఉద్బోధించి అమరులైనారు. శంకర, రామానుజ, మధ్వాచార్యులు, వర్ధమాన, జరాతుష్ట్ర, క్రీస్తువంటి ప్రవక్తలు, గాంధీ, నెహ్రూల వంటి నాయకులు ఈ సత్యాన్ని గుర్తించి శాంతి, అహింస సత్యవ్రతాలను ఆచరించి ప్రబోధించారు.

అయితే తోటి మానవుని ప్రేమించలేని మనిషి జంతువులపట్ల బలహీనమైన అభి

## టర్న్ గేటు తోస్తే ఎనిమిది గాలనుల నీళ్ళు నిండుతాయి!



సుప్రసిద్ధ శాస్త్రజ్ఞుడు థామస్ ఎడిసన్ అందమైన తన వేసవి విడిదికి తాను కని పెట్టి అభివృద్ధిపరచిన శ్రమను తగ్గించే అనేక సాధన సదుపాయాలు అమర్చాడు. ఒక రోజున తన అధికారులకు, స్నేహితు లకు తన విడిదిని చూపిస్తూండగా ఒక ఆమె "అంతా మహాద్భుతంగా ఉందిగాని ఆ 'తిరు గుడు గేటు'ను త్రోసుకురావడం చాలా కష్టం" అని చెప్పింది. "ఓ! నీవు ఆ తిరు గుడు గేటు (Turnstile) త్రోసుకు వచ్చే టప్పటికి 8 గాలనుల నీళ్ళు నా మేడమీది టాంక్‌లో చేరతాయి" అని ఎడిసన్ వెంటనే జవాబు చెప్పాడు.

"విద్యావంతుడు ఎంత వినయవిధేయతలను చూపగలిగితే అంత విశిష్టతను పొందగలుగుతాడు."

ప్రాయం కలిగి ముందు వెనుకలు ఆలోచించటంలేదు. పారిశ్రామిక వాడలనుండి వచ్చే విషవాయువులు పక్షికోటిని, నదులలో కలిసే విషపదార్థాలు జలగర్భ జంతుజాలాన్ని పరోక్షంగా నశింపజేస్తున్నాయి. రాళ్ళను రప్పలనే కాకుండా సమస్త జంతుకోటిని భగవత్ స్వరూపాలుగా పూజించిన భారతీయ సంస్కృతి ఏనాడు భూతదయను కోల్పోతుందో ఆనాడు మానవీయత అంతరించి పోతుందనడంలో అనుచితంలేదు. మనిషి సాంఘిక జీవి కాబట్టి జంతుసంక్షేమం అంటే మానవ సంఘక్షేమమే అని తెలుసుకోవాలి.

* * *

పి. మోహన్, కోరుకొండ.

నీ శరీరాన్ని నీవే గిల్లుకో. నీకే తెలుస్తుంది నీ బాధ. మరి జంతువులను చంపుతావు ఎందుకు? ఆలోచించావా?

జంతువులు బ్రతికి - చచ్చి మానవునికి మేలే చేస్తున్నాయి. త్యాగానికి ప్రతీకలుగా నిలుస్తున్నాయి. మరి మానవుడు స్వార్థానికి జంతువుల్ని బలిచేస్తున్నాడు. ఇది న్యాయమా?

మానవుడు మదిలో దైవాన్ని చింతించినా, చింతింపక పోయినా కనీసం మానవత్వం నిలుపుకుంటే మానవీయతకు న్యాయం జరుగుతుంది.

"తలనుండు విషము ఫణికిని.... ఖలునకు నిలువెల్ల విషము" అన్న సుమతి వాక్కు మానవీయతను దృష్టిలో పెట్టుకుని రచించినదే కావచ్చు? ముందుగా మానవుడు తనేమిటో తెలుసుకోవాలి. జంతువులకు, తనకు గల అవినాభావ సంబంధాన్ని గుర్తించాలి. 'అహింసాపరమో ధర్మః' అ సూక్తిని మననం చేసుకోవాలి. మానవుని కన్నా త్యాగజీవి జంతువని గ్రహించాలి. జీవకారుణ్య సంఘాలు జంతు రక్షణకు అద్భుత కృషి చేస్తున్నాయి ప్రభుత్వం జీవరక్షకులకు 'జీవబంధు' అనే జాతీయ స్థాయి బిరుదునిచ్చి సత్కరిస్తుంది. అయితే ఏ పురస్కారాలు మానవుణ్ణి మానవీయత వినా 'జీవబంధు లనుగా మార్చలేవు.

మానవీయత అంతరంగిక విషయం! అంతర్యంలో 'ఆత్మతత్త్వం' నిజభావం ధరించుకుంటే జంతుసంక్షేమం దానంతట అదే అలవడుతుంది.

ముఖ్యంగా దైవాన్ని, క్షుద్రదేవతల్ని అడ్డుపెట్టుకుని మానవుడు స్వార్థంకోసంచేసే జంతుహింస అమానుషం!

మానవుడు 'కో అహం' నే నెవరు అని తెలుసుకోవాలి. స్వస్వరూపానుసంధానం చేసుకోవాలి ఇవే క్రమమార్గంలో నడిపిస్తాయి మానవుణ్ణి.

మానవుడు జంతుక్షేమానికి నిరంతరం కృషి చేయుగాక!

## అతి భయంకరమైన జంతు:

చిన్న చుంచువంటి జంతువు (Shrew) ప్రపంచంలో మిక్కిలి భయంకరమైన జంతువు. 2 అం.ల పొడవైన ఈ జంతువు కాటు త్రాచుపాము కాటు అంతటిది. తన బరువుకు రెట్టింపు భారం ఆహారం తింటుంది. తనకంటే మూడు రెట్లు పెద్ద జంతువులను తోకతో జాడిస్తుంది. దీని నోటియందు ఊరే లాలాజలం ఎలుకలను 3 నిమిషాలలో చంపగలంత విషపూరితం.

"తప్పుచేసినా పశ్చాత్తాపంతో మనస్సు తప్తమైతే

# అవీ - ఇవీ

## భారతదేశంలో తొలి "మాచ్ మేకర్":

ఢిల్లీలో భారతదేశపు మొట్టమొదటి 'మాచ్ మేకర్' - వివాహ సంబంధాలను కల్పించి సహకరించే కంప్యూటర్ సంస్థ ఒకటి ఏర్పాటైంది. ఎవరైనా కేవలం రూ. 150/-లు చెల్లించుకుంటే ఆ వ్యక్తికి పొత్తు కుదిరే సంబంధం చూపిస్తారు. మూడేసి నెలలకొక సారి దాదాపు 3 000 మంది వధూవరుల వివరాల జాబితాను సవరించి క్రమబద్ధం చేస్తారు.

* * *

## భారతదేశంలో 14 సర్కసు కంపెనీలు గూడారాలు ఎత్తేసాయి



భారతదేశంలో గత 100 ఏళ్ళగా ప్రదర్శన లిస్తూ ప్రజానీకానికి వినోదం, వేడుక కలిగిస్తూ రంజింపజేసే భారతీయ సర్కసు కంపెనీలు ముఖ్యంగా ఆర్థిక రంగాలలో ఏర్పడిన ద్రవ్యోల్బణంవల్ల, ప్రజానీకంలో సర్కసుల పట్ల ఏర్పడిన నిరాదరణవల్ల, ప్రభుత్వము వారి ప్రాపకం గానీ రక్షణ గానీ లేకపోవడంవల్ల క్రమంగా నశించిపోతున్నాయి. ఇప్పటికే దేశంలో 14 సుప్రసిద్ధ సర్కసు కంపెనీలు డేరాలు ఎత్తేసాయి.

* * *

## క్రొత్తరకం ప్రయాణ సౌకర్యం:

సుమారు 1,50.000 జనాభా గల స్విట్జర్లాండ్ (యూరప్) లోని జెనీవాలో పబ్లిక్ ట్రాన్స్పోర్టువారు ప్రయాణీకుల సౌకర్యార్థం 125 ఎర్ర రంగు సైకిళ్ళను పంచి పెట్టి క్రొత్తరకం ప్రయాణ సౌకర్యం కల్పించారు. తాళం వేయని ఈ సైకిళ్ళను ఎవరు బడితే వారు తీసుకుని ఉపయోగించుకుని ఊరంతా తిరిగి రావచ్చు. దీని నిబంధనల ప్రకారం ఈ సౌకర్యాన్ని వినియోగించుకునేవారు నగరం సరిహద్దులలో ఉండాలి. ఒకరు ఉపయోగించుకున్న తరువాత ఆ సైకిలును తిరిగి తాళం వేయకుండా మరొకరికి ఉపయోగపడేట్టుగా నిర్ణీత స్థలంలో ఉంచాలి.

## అమెరికాలో వైజ్ఞానిక సంస్థలు భారతీయులు నిర్వహిస్తున్నారు:

అమెరికా స్వాతంత్ర్య యుద్ధంలో పాల్గొని టిప్పుసుల్తాన్ నౌకాసేన ఆంగ్లేయులను ఎదిరించింది. నాటినుండి ప్రారంభమై 2 శతాబ్దాల పై బడి భారతదేశం అమెరికాకు సహకరిస్తూంది. ఈనాడు అమెరికాలో చాలా వైజ్ఞానిక సంస్థలు భారతీయులచే నిర్వహింపబడుతున్నాయి.

"నానాత్వంలో ఐక్యం అనుసంధానం చేసుకుంటూ,
జగత్తులో లీనమైతే జీవితం విశ్వవిలసనంగా ఉంటుంది."

## బహుముఖంగా ఉపయోగపడే లేసర్



(LASER)_ లైట్ ఆంప్లిఫికేషన్ బై స్టిములేటెడ్ ఎమిషన్ ఆఫ్ రేడియేషన్ ఉపయోగంలో భారతదేశం నూతన యుగంలోకి సాగుతుంది. జియలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా వారు తమ కార్యకలాపాలకు వీటిని ఉపయోగిస్తున్నారు. టెలి కమ్యూనికేషనులు, హీట్ ట్రీట్‌మెంటు, నౌకా సంబంధమైన కార్యకలాపాలకు కూడా లేసర్ ఉపయోగపడుతూంది.

* * *

## బ్రిటను కనిపెట్టిన రాడార్ కుక్కర్:

ఒక బ్రిటీషు సంస్థ క్రొత్తగా అభివృద్ధి పరచి రూపొందించిన రాడార్ హీటర్‌లో ఘనీభవింపబడిన ఆహార పదార్థాలను కొన్ని సెకండ్లలో వేడిచేయవచ్చు. చిన్న చిన్న ప్లేట్లలో ఘనీభవింపబడిన ఆహార పదార్థాలు కుక్కరుగుండా పోయే బెల్టులమీద ప్లేట్లలో అమర్చి పెడితే బెల్టుల మరో చివర వేడి వేడిగా ఆహార ప్లేట్లను సంగ్రహించి సర్వు చేయవచ్చు. వీటిమీద ఆహారం ఒకే సమం వేడి చేయబడుతుంది. ముఖ్యంగా పెద్ద పె హోటళ్ళలో వేడి వేడిగా ఆహారం వడ్డిం దానికి అనుకూలంగా ఉంటుంది. ఈ రాడారు కుక్కరు పౌ. 500 లు ఖరీదు చేస్తుంది

## అంధుల ఆనందానికి పూలతోటలు:

హాంకాంగ్‌లో ముఖ్యంగా అంధుల ఆన దానుభూతికి 80 రకాల పూలచెట్లు, మొక్కలు, పొదలు నాటిన రెండు తోటలు ఏర్పాటయ్యాయి. ఇక్కడి పువ్వుల మొక్క అపూర్వమైన సువాసనలు, ఆకారాలు, ప మాణాలు గ్రుడ్డివారు స్పర్శవల్ల, వాసనవల్ల తెలుసుకుని ఆనందాన్ని అనుభవించగలరు.

* * *

## గొట్టాలద్వారా పాల పంపిణీ:

ఆల్పైన్ పర్వత ప్రదేశాలలో ప్రతి రోజూ ఉత్పాదింపబడిన పాలు స్విట్జర్లాండు సమభూములకు 7 మైళ్ళ పొడవై గొట్టాల ద్వారా సరఫరా చేయబడుతుంది

( 7 వ పేజీ తరువాయి)

## పువ్వులు తాజాగా ఉండాలంటే:

గులాబీలు మొదలైన కోసిన పువ్వులు తాజాగా ఉండాలంటే తొడిమలు కొద్దిగా కాల్చి తరువాత వేసుల్లో అమర్చండి.

## బొగ్గు దుర్వాసనలను పోగొడుతుంది:

రెఫ్రిజరేటరులో ఒక చిన్న పళ్ళెంలో బొగ్గుపెడితే ఘాటుగా ఉండే వాసనలు, ఇతర దుర్వాసనలు పోతాయి.

"యశఃప్రాప్తినో ధనప్రాప్తినో లక్ష్యముగా జేసుకొని సాంసారికుడు కార్యశీలుడగుచున్నాడు."

# మనమంతా భారతీయులమే

కార్మికులమైనా, కర్షకులమైనా, వ్యాపారస్థుల మైనా, పారిశ్రామిక వేత్తలమైనా, ఉపాధ్యాయులమైనా, విద్యార్థులమైనా, రచయితల మైనా, చిత్రకారులమైనా, ఏ జాతికి చెందిన వారమైనా, ఏ రాష్ట్రానికి చెందిన వారమైనా మనమంతా ప్రప్రథమంగా నూటికి నూరు పాళ్లు అచ్చమైన భారతీయులం. మన మాతృదేశం భారతదేశం.

పవిత్రమైన భారతభూమి మీద జన్మించి



జీవిస్తున్నాం. మనలో ప్రతిఒక్కరి రక్తనాళాలలోను మనదేశాన్ని పావన మొనరిస్తున్న ఇండస్, గంగ, బ్రహ్మపుత్ర, గోదావరీ, కృష్ణా, కావేరీ జలాలు ప్రవహిస్తున్నాయి. ఉత్తరదిక్కున మహోన్నత హిమాలయ పర్వతాలు, తూర్పున బంగాళాఖాతము, పశ్చిమమున అరేబియా సముద్రము, దక్షిణమున దక్షిణ మహా సముద్రము. మనలను సదా సంరక్షిస్తున్నాయి. ఒకే గొడుగు క్రింద చేరిన మనమంతా దేశ సమైక్యతకు, ప్రగతికి ప్రతిజ్ఞ తీసుకుందాం.

ఎన్ని రంగులు! ఎన్ని వింతలు! ఎంత సొగసు! వ్యక్తిత్వాన్ని వేరు చేసుకునే వైషమ్యాల విషవలయం కాదు. సాంప్రదాయంలో ప్రతి ఒక్కరూ జాతీయ సమైక్య సమగ్ర జీవితానికి సహకరించుకునే సమిష్టి జీవితం మనది. స్వధర్మంతో సరిసమానంగా ఇతర ధర్మాలను సమతాభావంతో గౌరవించగలవారే తమ ధర్మాన్ని గౌరవించగలరనే అశోకుని ధర్మాన్ని పాటించాలి.

యుద్ధాలు లేకపోవడం అనేది మాత్రమే శాంతి అనిపించుకోదు. మానవ మనుగడకు ప్రగతికి చైతన్యవంతమైన సహకారోద్యమమే శాంతి అనిపించుకుంటుంది. ఆశాజ్యోతిని ప్రకాశవంతం చేయడమే శాంతి. ధైర్య సాహసాలతో వ్యక్తిగత మూర్తిత్వము ను ప్రకాశింప చేసుకోడానికి అవకాశాలు కలిగించుకోడమే శాంతి.

—ఎన్.సి. కౌన్సిల్.

## భర్తకు కట్టుబడి ఉండవలసిన బానిస కాదు భార్య

దివ్యత్వము, పశుత్వము రెండూ కలసి ఏర్పడినవారే భార్యాభర్తలు. భార్య భర్తకు కట్టుపడిపోయి ఉండవలసిన ఒక బానిస కాదు, సహధర్మచారిణి. తన ధర్మాన్ని తాను అవలంబిస్తూ భర్త స్వాతంత్ర్యంగా అనుభవిస్తూన్న సుఖదుఃఖాలను పంచుకొనే భాగస్వామిని.

—మహాత్మా గాంధీ

"జీవాత్మకు పరమాత్మకు గల సంబంధం అతి నిగూఢం, అతి నిబిడం."

# వృద్ధాప్యంలో నిశ్చింతంగా ఉండాలంటే?

ఎస్. వి. మొఘె

ఒక వ్యక్తి వృద్ధాప్యం దాపురించిన తరువాత తాను చేస్తూన్న ఉద్యోగం నుంచిగానీ, వ్యాపారం నుంచిగానీ రిటైరు అయినప్పుడు ఎలా జీవిస్తాడు అనేది ముఖ్యంగా ఆ వ్యక్తి ధనిక వర్గానికి చెందినవాడా, నెలజీత బత్తాలు సంపాదించుకునే మధ్యతరగతికి చెందినవాడా లేక కార్మిక వర్గానికి చెందినవాడా అనే విషయంమీదే విశేషంగా ఆధారపడి ఉంటుంది.



పెద్ద అంతస్థులో ధనికవర్గానికి చెందిన శ్రీమంతులకు తమ వృద్ధాప్యాన్ని గురించి గానీ, రిటైర్మెంటును గురించి గానీ ఏ విచారం ఉండదు. వీరికి ధనం వృద్ధాప్యంలో కావలసిన సుఖసౌకర్యాలను సమకూరుస్తుంది. కార్మిక వర్గానికి చెందినవాళ్ళు ఎప్పటిలాగే పనిచేసుకుంటూనే ఉంటారు. నిత్య జీవన ప్రమాణానికి అనుగుణంగా ధనం ముడుతూనే ఉంటుంది. ఎటువచ్చీ ఉద్యోగాలలో నెలజీత బత్తాలు తెచ్చుకునేవారు రిటైరు అయినప్పుడు తమ వృద్ధాప్యం గురించి ఆందోళన పడిపోతారు.

ఏ వర్గానికి చెందినవారైనా పరిమితి కుటుంబంతో తమ తమ జీవితాలను ముందుగానే ప్రణాళికాబద్ధం చేసుకుంటే వృద్ధాప్య వచ్చి రిటైరు అయేటప్పటికి కొడుకులు, కూతుళ్ళు పెళ్ళిళ్ళు అయి స్థిరపడిపోయి ఉంటారు. తాహతుకు తగినట్టుగా గొప్పలకు పోకుండా జీవిస్తూ కొంత సొమ్ము ఆదా చేసుకోగలిగితే ఏ తాపత్రయాలు లేకుండా హాయిగా జీవించగలుతారు. ఇది అందరికీ సాధ్యంకాదు. ఇటువంటి నిరామయ జీవితానికి అందరూ నోచుకోరు. వృద్ధాప్యం వచే

## చిరపుంజి పనికిరాని బీడుగా ఏర్పడుతూంది!

భూప్రదేశం మీద అత్యధికంగా వర్షపాతం ఉండే చిరపుంజి (మేఘాలయా) అతి త్వరలో పనికిరాని బీడుగా మారిపోతుంది. ముఖ్యంగా ఇక్కడ కొండ జాతులు వ్యవసాయ విధానంలో జూమ్మింగ్ (Jhuming) విదానం (వ్యవసాయ స్థలం మార్పిడి) అవలంబించడంవల్ల భూములు నిస్సారమైపోతున్నాయి. చిరపుంజిలో భౌగోళిక పరిస్థితుల ప్రభావం వల్ల సంవత్సరానికి సగటు వర్షపాతం 1150 సెం. లు.

(పిఇఇ-ఎన్.ఎఫ్.ఎస్)

"యోగ్యమైన వేషమును ధరించుట పైతము
ఒక్కొక్కప్పుడు తలవని తలంపుగా శుభప్రదము కాగలదు."

సరికి చీకు, చింత, చికాకు, విసుగు, రోగం రొచ్చు పట్టుకుంటాయి. ఆదాయం తగ్గడం వల్ల లోభత్వం పెరుగుతుంది. కుటుంబ సభ్యులతో సామరస్యంగా ఉండలేకపోతారు. కొడుకులతో, కోడళ్ళతో విరోధాలు పెంచుకుంటారు. ఇటువంటి వారికి ఇక జీవితం విఫలమైపోతుంది.

వృద్ధాప్యాన్ని గురించి మేధావంతులైన సుప్రసిద్ధ రచయితల అభిప్రాయాలను తెలుసుకుంటే ఇటువంటి వృద్ధులు తమ



జీవితాలను చక్కదిద్దుకోగలుగుతారు.

"అధ్యయనం చేసి తెలుసుకోడం మానిన నాటినుంచీ వృద్ధాప్యం ప్రారంభమవుతుంది" —హెర్బెర్ట్ కేసన్

"వృద్ధాప్యం వల్ల సంభవించే అసమర్థతల వల్ల మానసిక బాధలు కలగడం ప్రారంభించి నప్పటినుంచీ మనం వృద్ధులమే కాని అంతకు ముందునుంచీ కాదు. కాల నిర్ణయం చేసేది వయస్సు కాదు. ఆరోగ్యమే వృద్ధాప్యాన్ని నిర్ణయిస్తుంది." —డా. మాక్స్ జేకబ్ సన్

"పురుషుడు భావానుగుణ్యంగా
అనుకున్నంత వృద్ధుడవుతాడు.
స్త్రీ రూపానుగుణ్యంగా
వృద్ధురాలు అవుతుంది." —సామెత

"యౌవ్వనంలో తప్పించుకొని ఎగవేసిన
కష్టసాధ్యమైన కార్యక్రమాలు
చేపట్టడానికి వృద్ధాప్యం సిద్ధం."
—డబ్లు. సోమర్ సెట్ మామ్

"వృద్ధాప్యంలో ఎలా జీవించాలనేది

## ప్రపంచంలో అచ్చయిన మొట్టమొదటి పుస్తకం

క్రీ. శ. 767 సం. లో జపాన్ రాణి మెబటోకు ఆదేశాన్ని అనుసరించి బుద్ధుని 10 లక్షల సూక్తుల్ని చైనాలో వాంగ్ చీ అనునతడు కొయ్యపలకలతో బ్లాకులను తయారుచేసి అచ్చువేశాడు. ప్రపంచంలో మొట్టమొదట అచ్చయిన ఈ పుస్తకం 1900 సం.లో కాన్స్ (చైనా)లో లభించింది. 'లార్డ్ ప్రేయర్' ప్రపంచంలో అతి చిన్న పుస్తకం. ఇది వార్సా (పోలండ్) లోని మ్యూజియంలో ఉంది. పొడవున్ను బరువుతో 6 అ. 10 అం. ఎత్తుగా ఉండే 'స్టోరీ అఫ్ సౌత్' అనే పెద్ద పుస్తకంలో పుటలు 12 హార్స్ పవర్ యింజను సహాయంతో త్రిప్పబడుతాయి. ఇదే ప్రపంచంలో అతిపెద్ద పుస్తకం.

...."మాయయొక్క గుట్టు తెలిసినంతనే మాయ తొలగిపోవును."

వివేకంతో కూడిన ప్రావీణ్యత మీద
ఆధారపడి ఉంటుంది జీవితకళ
సులభంగా అర్థంకాని ఉద్గ్రంథం."

—అమీల్

"జీవితం మీద అభిలాష పెంచుకో,
వృధాగా కాలక్షేపం చేయకు ఎందుకూ
పనికిరాని అప్రయోజకత్వంవల్ల
ముసలితనం ముంచుకు వస్తుంది.
అనుభవంతో, వివేకంతో సమర్థతను
అభివృద్ధి చేసుకుంటూ మారుతున్న
పరిసరాలకు సరిపెట్టుకుంటూ
జీవితాన్ని సరిపుచ్చుకో."

—గ్రేట్ ఎడ్వెంచర్

"జీవితాభిలాష నశించేదాకా ఎవరూ ముసలివారు కారు. ఆత్మ నశించి గుండె ఆగిపోయేదాకా ఎవరూ వృద్ధులు అవరు. నిత్య చైతన్యంతో సృజనాత్మకమైన జీవితం జీవించేవారికి వృద్ధాప్యం లేదు."

—స్వెట్ మార్డెన్

ముసలితనం వచ్చేటప్పటికి శారీరక సౌష్ఠవం తగ్గుతుంది. భౌతిక సుఖాలకు విరామం కలుగవచ్చు. కాని ఆధ్యాత్మిక ఆనందం ఎప్పుడూ అందుబాటులోనే ఉంటుంది. నిత్యసంతృప్తితో అనంత సౌఖ్యాన్ని అనుభవించవచ్చు. —కె. సరూప్

నిరామయమైన నిత్యానందంలో నిర్జరత్వం ఉంది. ఎప్పుడూ యౌవ్వనంలోనే ఉంటారు. వయస్సు ముదిరి వృద్ధాప్యం దాపురించినా యౌవ్వనంలోనే మరణిస్తారు. అని ట్రాయిన్ ఎడ్వర్డ్ చెప్పినది వాస్తవం.

చివరగా పాల్మర్ చెప్పినట్టు సక్రమమైన యౌవ్వన జీవితం అనుకూలవంతమైన ముసలితనానికి రాజబాట.

## ప్రపంచంగా భారతదేశంలో 3 వ శతాబ్దంలో ద్రవ్యం



భారతదేశంలో మొట్టమొదట 3 వ శతాబ్దంలోనే ద్రవ్యం వాడకంలోకి వచ్చింది. మొట్టమొదట వెండి లోహంతో తయారైన నాణాలు భారత దేశమంతటా 13 వ శతాబ్దంలో వాడుకలో ఉండేవి. దేశంలో మొట్టమొదట నాణాలకు రంధ్రాలు వేసేవారు. ఆ తరువాత క్రమపద్ధతిలో బంగారు నాణాలు కుషానుల కాలంలో వచ్చాయి. కుషానులు అనేక రాగి నాణాలను కూడా ముద్రించేవారు. భారత దేశంలో అనేక సంవత్సరాల వరకూ వ్యాపారం రాగి నాణాలతోనే సాగేది. బ్యాంకులలో సొమ్ము ఆదా చేసుకోడం, భీమాపద్ధతి 17 వ శతాబ్దంలో ప్రారంభమైంది. పరాబులు వ్యాపారం అంతా పాశ్చాత్య ఆర్థిక విధానం మీదే ఆధారపడి ఉండేది.

"ఏ బాధకైనా సహనమే సంజీవిని."

# ప్రపంచవార్తలు

## ప్రపంచంలో మిక్కిలి పెద్ద దూరదర్శిని:

ప్రపంచంలోనే అతి పెద్ద దూరదర్శిని మానోకే (Maunokea) అనే హవాయి అగ్నిపర్వత ప్రదేశంలో 13,600 అడుగుల (4,145 మీటర్లు) ఎత్తు మీద నిర్మించబడుతుంది.

10 గజాల వ్యాసంతో 36 దర్పణాలతో తయారుచేయబడే ఈ అపూర్వ సాధనంవల్ల



గగన వీధిలో ఇంతవరకు మన కంటబడని ప్రదేశాలు పరిశోధించడానికి వీలుపడుతుంది.

* * *

## ప్రాచీన చైనాలో వాతావరణ కాలుష్యం:

చైనాలో లాప్‌నార్ (Lopnor) అణు ప్రయోగ ప్రదేశంలో (Atomic Testing Ground) బయల్పడిన ప్రాచీనకాలపు ఒక స్త్రీ భౌతిక కాయాన్ని శవపరీక్ష చేస్తే 3,000 సం.లకు పూర్వం వాతావరణ కాలుష్యంవల్ల ఆమె ఊపిరితిత్తులు కార్బన్, సిలికాన్‌లు ఎక్కువగా చేరి దెబ్బతిన్నట్లు తెలిసింది.

* * *

## కువెయిట్‌లో క్రొత్త నూనె వనరులు:

పశ్చిమ ఆసియా అరేబియా గల్ఫ్‌లోని కువైట్‌లో క్రొత్త నూనె వనరులు బయల్పడ్డాయి. వీటివల్ల ఇప్పటి నూనె ఉత్పాదన రేటుతో ఇంకా 250 సంవత్సరాల వరకూ నిరాటంకంగా నూనె లభిస్తుందిట.

* * *

## 4,600 మిలియను సంవత్సరాలనాటి ఉల్కా ఖండములు:

అంటార్కిటికాలో అమెరికా శాస్త్రజ్ఞులు కనుగొన్న ఉల్కలకు సంబంధించిన చిన్న ఖండాలు 4,600 మిలియను సంవత్సరాల నాటి అతి పురాతన వస్తు సముదాయము. ఈ ఖండాలు సూర్యుడు, ఇతర గ్రహాలు ఏర్పడిన మౌళిక మేఘ సంబంధమైన వస్తునిర్మితమై ఉన్నాయి.

### ద్రవ్యోల్బణం అంటే?

ద్రవ్యోల్బణం - ఇతరుల బలవంతంమీద వినియోగదారులు తమకు స్థోమత లేకపోయినా అనవసరమైన వస్తువులను కొనడం వల్ల ఏర్పడుతుంది:

"యథార్థ కథనము అలంకారము కాదు."

## బవేరియన్ వనాలే బయోస్ఫియర్ రిజర్వులు:

పశ్చిమ జర్మనీలో బవేరియా వనాలకు యునెస్కోవారు బయోస్ఫియర్ రిజర్వులు (జీవావరణ రిజర్వులు) అని పేరు పెట్టారు. ప్రపంచపు తొలికాలపు వనాంతరాల జీవావరణ పోలికలు అన్నీ బవేరియా వనాలలో ఉన్నాయి.

* * *

## ప్రపంచపు సాహసోద్యమ శ్రేణిలో ఐ బి ఎమ్ దే ప్రథమ స్థానం:

ప్రపంచంలో ప్రజాసంబంధమైన సుప్రసిద్ధ 100 పరిశ్రమలలో యునైటెడ్ స్టేట్స్ పెద్ద కంప్యూటరు సంస్థ ఐ బి ఎమ్ (IBM) ప్రథమ స్థానాన్ని పొందుతూంది అని జపానుదేశపు ప్రబల ఆర్థిక పత్రిక నిహాన్ కెయిజై షింబున్ (Nihon Keizai Shimbun) ప్రకటించింది. జపాను దేశపు సుప్రసిద్ధ టొయోటా మోటార్స్ (Toyota Motors) సంస్థ 6 వ స్థానాన్ని పొందుతూంది.

* * *

## ఆఫ్రికాలో తక్కువగా అభివృద్ధి పొందిన దేశాలు:

ఆఫ్రికాలో నిరుద్యోగత క్రమంగా పెరిగిపోతూంది. పెట్టుబడి, సహాయ నిధుల లోపించడంవల్ల, అభివృద్ధి సహాయక నిధుల లోపం వల్ల ప్రస్తుతం ఉన్న పరిస్థితులలో ఆఫ్రికాలో 43 శాతానికి ఏ ఉద్యోగ అవకాశాలూ లభించని సూచనలు ఉన్నాయి. ప్రపంచంలో అతి తక్కువగా అభివృద్ధి పొందిన 36 దేశాలలో 500 మిలియను జనాభా గల ఆఫ్రికాలో 26 దేశాలు ఉన్నాయి.

* * *

## జపానుదేశపు అధిక వేగమైన చక్రాలు లేని ట్రెయిను:

ట్సుకుబా (Tsukuba) లో ప్రదర్శింపబడుతూన్న జపానుదేశపు క్రొత్త అధిక వేగపు ట్రయినుకి చక్రాలు లేవు. ఇవి అత్యధిక వేగం పొందినప్పుడు ట్రెయిను కొద్దిగా పైకి లేచి గాలిలో వెడుతుంది. గంటకు 187 మైళ్ళ అత్యధిక వేగంతో ఇది పోతున్నప్పుడు, రైలు మార్గంమీద ఒక సెంటీమీటరు పైకి ఎత్తబడి ఉంటుంది.

## 26. కి. గ్రా. ల దోసపం



26 కి.గ్రా.లు తూగే రాకాసి దోసపండు దక్షిణ బ్రెజిల్‌లో పండింపబడింది. అదే తోటలో 15 కి.గ్రాలు తూగే బంగాళాదుంప కూడా పెరిగింది.

('మిషా' సౌజన్యంతో)

"ప్రపంచమునందు ఏ వస్తువైనను ఔచిత్యాన్ని ఉల్లంఘిస్తే రాణించదు."

# 'రెడ్ పాండా' నైపుణ్యం

రూపాల్ రావల్

శరీరం అంతా విరివిగా బొచ్చుతో నిండి వెచ్చగా ఎప్పుడూ ముడుచుకు కూచునే రెడ్ పాండానే లెస్సర్ పాండా, కేట్ బేర్, ఫాక్స్ కేట్ ఫైర్‌ఫాక్స్, హిమాలయన్ రాకూన్ అంటారు. ఎవ్వరికీ కనిపించకుండా తప్పించుకు తిరిగే ఈ రెడ్‌పాండా చాలా ముద్దుగా ఉంటుంది. ఇది ఎలుగుగొడ్డును, పిల్లిని, రాకూన్‌ను పోలి ఉండటం ఇంకో అవగాహన కాని విషయం. మొట్టమొదట తెలుపు, నలుపు



రాకాశి పాండాలను కనిపెట్టిన తరువాతే రెడ్ (ఎర్ర) పాండా కూడా దీని దగ్గర సంతతకి చెందినదని ప్రకటించారు.

రెడ్‌పాండా ప్రపంచం అంతటా శాస్త్రజ్ఞులను కలవర పెట్టేసింది అసలు దీనిని కనుగొన్న తరువాత 50 సంవత్సరాల దాకా పాండా అనే జంతువు ఇది ఒక్కటే. మొట్ట మొదట 1825 వ సం. లో పాశ్చాత్య దేశీయులు దీనిని తెలుసుకున్నారు. తరువాత 1869 వ సం. లో యూరోపియనులు రాకాశి పాండాను గూర్చి తెలుసుకున్నారు.

రెడ్‌పాండా పరిస్ఫుటమైన వర్ణవిన్యాసం వల్ల, అపూర్వమైన మార్దవం వల్ల ఇవి చాలా అందంగా ముద్దుగా ఉంటాయి. ముదురు రంగులో ఉండే క్షీరదాలలో రెడ్ పాండాకి ఎర్రటిరంగు, మెత్తటి బొచ్చు ఉంటుంది. సాధారణంగా ఇది ఇళ్ళలో తిరిగే పెద్దపిల్లి సైజులో ఉంటుంది. తోక ఎరుపు వర్ణంతో ఉండి నారింజపండు రంగు వలయాలతో 60 సెం.మీ. ల పొడవు ఉంటుంది. శరీరం నిడివిగా ఉండి ముక్కోణాకారం ముఖంతో నిక్కబొడుచుకున్న నిడుపాటి చెవులుంటాయి. సాధారణంగా తెల్లటి ముఖం మీద కళ్ళచుట్టూ నల్లటి వలయాలు బయలుదేరి ఇవి గడ్డంవరకూ విస్తరించి ఉంటాయి.

## ఎరచూపి చేపలను పట్టుకునే పక్షులు

జపాన్‌లో హెరాన్ పక్షులు మనుషులు లాగే ఎర చూపి చేపల్ని పట్టుకుంటాయి. చేపలు సమృద్ధిగా ఉండే జలాశయాల దగ్గర ఈ పక్షులు ఎగురుతూ చిన్న చిన్న పురుగులను. నాచుముక్కలను సమయం చూచి వీటిలో పడేస్తాయి. ఆశతో వాటి కోసం వచ్చిన చేపలను హెరాన్ చటుక్కున ముక్కుతో పట్టేస్తుంది.

"అనుచిత పద ప్రయోగములతో కూడిన
శ్రవ్య కావ్యములు శ్రోతల మనస్సులను అలరింపవు."

రెడ్‌పాండాలు వెదురుచిగుళ్ళు, పచ్చగడ్డి, పళ్ళు, వేళ్ళు, దుంపలు, బెర్రీలు తింటాయి. అప్పుడప్పుడు గ్రుడ్లను, చిన్న చిన్న జంతువులను కూడా తింటాయి. రాత్రి సంచరించే జంతువు కాబట్టి ఇవి పగలు దట్టమైన చెట్ల మీద కొమ్మల నీడను నిద్రిస్తాయి. ఇవి పడుకునేటప్పుడు తోకను చుట్టిపెట్టి ముఖాన్ని కప్పుకు పడుకుంటాయి. సుమారు 1800 మొదలు 4000 మీ. ఎత్తున దూరంగా కొండల మీద మంచుతో కప్పబడిన వెదురుపొదలలో ఇవి నివసిస్తాయి. ఈ వెదురు పొదలలో ఆహారాన్ని వెతుక్కుంటూ కాళ్ళు జాపుకుని ముందుకాలు పంజాతో కొమ్మలను పట్టుకుని కూర్చుంటాయి. కాలికి బొటనవ్రేలు ప్రక్క పెరిగిన చిన్న వ్రేలితో గట్టిగా కొమ్మలను పటుకుంటాయి.

క్షీరదాలలో రాకాశిపాండాకి మాత్రమే ఆరవ బొటనవ్రేలు ఉంటుంది. ఇవి చెట్లను అవలీలగా అతినైపుణ్యంగా ఎక్కుతాయి. బొచ్చుతో కప్పబడిన పాదాలు, కొద్దిగా ముందుకు వంగిన గోళ్ళ సహాయంతో ఇవి చెట్లను, మంచుకొండలను సౌలభ్యంగా ఎక్కగలుగుతున్నాయి. ఇవి చాలా మెల్లిగా నడుస్తాయి. వేగంగా పరుగెత్తలేవు. దూరంగా నివసించడం, ముడిచి పెట్టుకు కూర్చోడం, బలిష్టమైన దౌడలు, మంచి పదునైన గోళ్ళు వీటికి ఆత్మ సంరక్షణ కలిగించే సాధనాలు. వరల్డ్ వైల్డ్ లైఫ్‌ఫండ్ (World WildLife Fund) వారు రాకాశి పాండాను వారి చిహ్నంగా నిర్ణయించుకున్నారు.

(పిఐఇ-ఎన్.ఎఫ్.ఎస్)

## అమూల్యమైన నవ్వు



అంగడిలో డబ్బుపెట్టి కొనుక్కుందామన్నా దొరకదు. అప్పు తెచ్చుకుందామన్నా లభించదు, అమూల్యమైన నవ్వు. నవ్వడం వల్ల మనకు పోయేది ఏదీ లేదు. ఎంతో లాభం కలిగిస్తుంది. ఇచ్చినవారికి ఏ నష్టం లేకుండా పుచ్చుకునే వారికి మంచి కలిగిస్తుంది.

ఒకే ఒక్క క్షణం చిరునవ్వు నవ్వవచ్చు. కాని దాని ఫలితాలు చిరస్థాయిగా కలకాలం ఉండిపోతాయి. చిరునవ్వు నవ్వలేని భాగ్యవంతులు లేరు. చిరునవ్వుకు నోచుకోని నిరుపేదలు లేరు. పరిసరాలను ఆనందమయం చేస్తుంది. కార్యదక్షతను ప్రవృద్ధి చేస్తుంది. ప్రేమాభిమానాలు పెరుగుతాయి. జీవితంలో అలసిపోయిన వారికి విశ్రాంతి, సుఖం కలిగిస్తుంది. నిరాశాపరులకు ధైర్యోత్సాహాలనిస్తుంది. నవ్విన తక్షణమే దాని విలువ కనిపిస్తుంది. జీవితంలో నవ్వలేని వారు కనిపిస్తే కనికరించు. ధారాళంగా ఔదార్యంతో నీవు ఇవ్వగలిగినంత నవ్వు పంచిపెట్టు. వారిలో సంతోషాన్ని కలిగించిన పుణ్యం కట్టుకుంటావు. జీవితాన్ని సఫలం చేసిన ధన్యుడవు అవుతావు.

"పదిమంది మానవులు చేసేపని ఒక యంత్రం చేయవచ్చు కాని, ఏ యంత్రం మానవాతీతుని పని చేయలేదు."

# ఒంటరితనం పోగొట్టుకోవాలంటే?

డా. క్లైవ్ డి. హార్లీ

దారిద్ర్యాన్ని మించిన బాధ మరోటిలేదు. దీర్ఘ రోగాలను ఎదుర్కోడం దుస్సాధ్యం. నరాలకు సంబంధించిన రోగాలు భయంకరం. వీటిని అన్నిటిని మించినది ఒంటరితనం. ఒంటరితనంలో అనుభవించే మానసిక ఆందోళన వర్ణనాతీతం. ఒంటరితనాన్ని మించిన మనోవేదన మరోటిలేదు. కిట కిట లాడుతూన్న జన సమూహంలో ఒంటరితనం కలగవచ్చు. మరణసమయంలో పలికేవాళ్ళు



లేకపోవడంవల్ల ఇది మరింత తీవ్రరూపం ధరిస్తుంది.

ఒంటరితనంలో అల్లల్లాడి పోతారు. గాబరా పడిపోతారు. ఒంటరితనం రాజకీయ నిర్బంధితుల శిబిరం (Concentration camp) లో ఒంటరి కారాగార శిక్షవంటిది. ఈ కారాగార శిక్షకు, తెచ్చిపెట్టుకున్న ఒంటరి తనానికి వ్యత్యాసం ఉంటుంది.

తనను ఒక పెద్ద రాజభవనంలో చీకటి కొట్టులో పెట్టి తాళంవేసినట్టు కలగన్నట్టు డా. గున్ ట్రిప్‌తో ఒకావిడ చెప్పింది. కలలో తన బాధను జైలు అధికారితో విన్నవించింది. దానికి జైలు అధికారి 'చీకటి కొట్టుకు తాళంచెవి నీ దగ్గరే ఉందే' అన్నాడుట. తాళంచెవి చీకటి గదిలో ఉన్న వారి దగ్గరే ఉంది. కానీ తాళం తెరచుకో లేదు! ఇదే విచిత్రం ఇక్కడ! ఒంటరితనం అనే సమస్య మీద అనేకమంది తీవ్రమైన పరిశోధనలు అనేకం చేసారు. ఇంకా దీన్ని గురించి తెలుసుకోవలసిన విషయం చాలా ఉంది. ఒంటరితనంతో ఆందోళన పడిపోయే వారు ముఖ్యంగా నాలుగు భయంకరమైన సమస్యలను ఎదుర్కోవలసి వస్తుంది.

1. ఆవరణ భయం: దీన్నే ఎన్‌గల్ఫ్‌మెంట్ (Engulfment) అంటారు. నలుగురిలో చేరేటప్పటికి ఇతరులు బలవంతంగానీ,, పెత్తనంగానీ చేస్తూన్నారని అనిపిస్తుంది. ఇటువంటి భావన వీలో వచ్చిన వెంటనే నువ్వు నీ వ్యక్తిత్వాన్ని నశింప చేసేసుకుంటావు. నిన్ను నీవు ప్రకటించుకో

## సాధారణంగా నవ్వినప్పుడు 37 కండరాలు పనిచేస్తాయి

మందహాసం చేసినప్పుడు ముఖంలో మూడు కండరాలు కదులుతాయి. సాధారణంగా నవ్వినప్పుడు 37 కండరాలు, బాగా కడుపు ఉబ్బేటట్లు నవ్వినప్పుడు 80 కండరాలు పనిచేస్తాయి.

"బాహ్యాభ్యంతర ప్రకృతుల ఐక్యము సిద్ధించినవాడే కవి."

లేక పోతున్నావు. పరాయివాళ్ళు నిన్ను వలలో వేసేసుకున్నారనే అపోహ బయలు దేరుతుంది. ఊపిరి ఆడదు. వాళ్ళవల్ల నీకేదో ముప్పు కలుగుతుందనే భయంతో వణికి పోతావు.

ఇదే మునిగి అణగారి పోతున్నామనే భయం. ఈ భయంలో ఒంటరిగా ఉండడానికి ఇష్టంలేక పోయినా ఇతరులతో కలసి మెలసి సమాజంలో సంచరించడానికి సాహసించ లేకపోతారు. లోకం అడ్డదిడ్డాలుగా కనిపిస్తుంది. పెద్దపులిలాగా మీదపడి మ్రింగేస్తారనే ఆందోళనతో విలవిలలాడి పోతారు.

2. సంగ్రాహక భయం: దీన్ని ఇంప్లోషన్ (Implosion) భయం అంటారు. పెద్ద ధ్వనితో ప్రేలిపోయి చెల్లాచెదరు అయి పోవడం విస్ఫోటనం. సంగ్రహించుకుని పూర్తిగా ముడుచుకొని సంలీనమై పోవడం ఇంప్లోషన్. విస్ఫోటనంలాగ ఇంప్లోషన్ కనిపించదు. వినిపించదు.

ఇది అంతర్గతంగా సద్దు లేకుండా నిశ్శబ్దంగా లోలోపల జరిగే విపరీత పరిణామాత్మకమైన పరివర్తనం. ఈ విపరీతమైన ఇంప్లోషన్ పరివర్తనవల్ల మానవుడు తాను దిగబడి పోతున్నాననే దిగులుతో నిగ్రృమ చెందిపోతాడు. పేరుపెట్టి పిలిస్తే ఉలికిపడి హడలిపోతాడు. మనస్సు శూన్యం అయిపోతుందనే భావన ఏర్పడుతుంది. సామాన్య సోదర మానవునిలా ప్రవర్తించ లేకపోతాడు. ఇది ఒక మానసిక భయం మాత్రమే. కేవలం మనోభావన.

3. వ్యక్తిత్వ శైథిల్యం: వ్యక్తిత్వ శైథిల్యాన్ని డిపెర్సనలైజేషన్ (Depersonalisation) అని చెప్పుకోవచ్చు. మనస్సులో భావాలు ఉప్పొంగిపోయి తట్టుకోలేనప్పుడు చిత్తక్షోభ కలుగుతుంది. చిత్తభ్రమ ఏర్పడుతుంది. విశ్చేష్టత ఏర్పడుతుంది. సుఖదుఃఖాల అనుభవం ఉండదు. జడత్వం ఆవరిస్తుంది. స్తబ్ధతతో ప్రవర్తిస్తారు. 'నాకు ప్రాణం పోయింది. రుచి తెలియటం లేదు. వాసన తెలియదు. నిద్రలో నడిచిపోతూన్నట్టు అనిపిస్తుంది, అని విలపించాడు ఒక వ్యక్తి. ఇక్కడ నిజానికి ఇతడికి కావలసిన భద్రత లభించింది. తన జీవితంలో పదిలం లేదని భ్రమిస్తాడు. వీరే బ్రతికి చచ్చినవారు. చైతన్యం ఉన్నా చిత్త వికారాలు ఉండవు, ఖేదమోదాలు ఉండవు. సాధారణంగా యుద్ధసమయాలలో వియంతల చేతికి చిక్కిన రాజకీయ బంధితులు అనుభవించే మానసిక హింస పొందుతారు.

## లేసర్ కిరణాలు వజ్రాలను కరిగిసాయి





"ప్రపంచంలో కఠినాతి కఠినమైన వజ్రం తొలిసారిగా లేసర్ కిరణపుంజ సహాయంతో కరిగింపబడింది. న్యూయార్కు కార్నెల్ యూనివర్శిటీ శాస్త్రజ్ఞులు లేసర్ కిరణ పుంజాన్ని ఏకస్ఫటిక వజ్రతలం మీదికి ప్రసరింపజేసారు. దీని ఫలితంగా వజ్రతలం కొంతభాగం కరిగింది.

"ఆత్మదృష్టి ప్రాప్తించినవారికి సర్వము సమమైతోచును."

ఇక్కడ వీరు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ జ్ఞానరహితమైన నిర్జీవ జీవితం అనుభవిస్తారు.

4. భీరుత్వం: ఒంటరితనానికి అలవాటు పడిన కొంతమంది సమాజంలో తిరగవలసి వచ్చినప్పుడు తాము ఏదో చేయకూడని అపరాధం చేసామని ఊహాత్మకమైన భయంతో క్రుంగిపోతారు. నలుగురిలో తల ఎత్తుకు తిరగలేరు. దిక్కుతోచకుండా దీనావస్థలో దిక్కుమాలిన జీవితాన్ని అనుభవిస్తున్నామని అనుకుంటారు.

ఉత్సాహపూరితమైన జీవితంలో నీలో దాగిన నీ అనంతశక్తిని ఎలా ప్రకటించుకుంటావు? నీ వ్యక్తిత్వాన్ని ఎలా ప్రభావితం చేసుకుంటావు? ఇదే మార్గం—

ప్రేమను అవగతంచేసుకో. అనురాగాన్ని విమర్శించుకో. ప్రేమానురాగాలకు అభినందనలు చెప్పుకో. పూర్వాపరాలకు అన్వయం కలిగించుకో. "నేనంటే ఎవరికీ కనికరంలేదు" అనుకోకు. మబ్బువీడిన నిర్మల నీలి ఆకాశంలో సూర్యభగవానుడు ఉదయిస్తాడు. ప్రకాశిస్తున్న సూర్యుని వెలుతురు కళ్ళు తెరచి చూడు. ప్రకృతిని పరీక్షించు. చలవ జోళ్ళు పెట్టుకుని నల్ల అద్దాలలో చూడడానికి ప్రయత్నించకు. మంచి వెలుగు కిరణాల స్పర్శ నీకు కలగనీ. సూర్యుడు స్వయం ప్రకాశకుడు. నీ జ్ఞానాన్ని స్వయం ప్రకాశం చేసుకో. చలివేస్తుందా? హాయిగా వెచ్చని దుప్పటి కప్పుకు కూర్చో. 'నేను అంటే అందరికీ ఇష్టం, నన్ను అందరూ అభినందిస్తున్నారు' అనుకో. మానసిక సంతృప్తి ఉద్భవిస్తుంది. 'నేను నేనే' అని మననం చేసుకో. నువ్వు నువ్వుగా ప్రకటించుకో. నీ శక్తి సామర్థ్యాలను గుర్తించుకో. నీ నిజ సత్తాలను తెలుసుకో. వెంటనే అపూర్వ చైతన్యం నీలో ఉద్భవిస్తుంది. నీ సౌందర్యం దివ్యసౌందర్యం అని ఆనందించు. నీ శక్తి అనంతశక్తి అని తెలుసుకో. పోషణమీదే జీవితం ఆధారపడి ఉంటుంది మనస్సులో దురాలోచనలు, దుస్వభావాలు, ద్వేషభావాలు పెంచుకుంటే నీ పతనం ప్రారంభిస్తుంది. ఆత్మ విశ్వాసంతో నువ్వు నువ్వుగా ప్రవర్తిస్తూ ప్రేమమూర్తివి అయితే నీ బుద్ధి వికసిస్తుంది. ఒంటరితనం గతానుభవం అవుతుంది. మానసిక బిగువు సడలుతుంది. జీవితంలో సామరస్యం ఏర్పడుతుంది.

## నికోటిన్ మెదడుకి అపాయం



సిగరెట్లలో ఉండే నికోటైన్‌వల్ల జ్ఞాపకశక్తి దెబ్బతింటుంది. నికొటైన్ లేని సిగరెట్లు కాల్చేవారు నికోటైన్ ఉండే సిగరెట్లు కాల్చేవారికంటే ఎక్కువ మాటలను జ్ఞాపకం చేసుకోగలిగారనే ఫలితాన్ని పరిశోధకులు తేల్చారు. రెండురకాల సిగరెట్లు కాల్చేవారిని ప్రత్యేకంగా సిగరెట్లను కాల్చక ముందు, కాల్చిన తరువాత పరీక్షచేసి ఈ ఫలితాన్ని నిర్ణయించారు.

"అనుభవాలను సమగ్ర దృష్టితో అన్వయించుకుంటే జీవితంలో సామరస్యం సిద్ధిస్తుంది."

# వెర్నే దీర్ఘదృష్టి

**1958** వ సం.లో నాటిలస్ (Nautilus) అనే అణు జలాంతర్గామి (Atomic Submarine) మంచుతో నిండిన ధృవప్రదేశాలలో ప్రయాణం చేసి ఉత్తర ధృవాన్ని దాటి చరిత్రను సృష్టించింది. దీనికి 100 సంవత్సరాల క్రితం రచించిన గ్రంథంలో మరో నాటిలస్ దక్షిణ ధృవం మంచులో ప్రయాణం చేసినట్టు ప్రస్తావింపబడింది. రెండవ 'నాటిలస్' జూల్స్ వెర్నే




రచించిన "ట్వెంటీ థౌజండ్ లీగ్స్ అండర్ ది సీ" గ్రంథంలోనిది.

జూల్స్ వెర్నే 1828 వ సం.లో ఫ్రాన్స్ నాన్‌టేస్‌లో జన్మించాడు. ఇతడు విద్యార్థిగా ఉన్నప్పుడు యంత్రాలన్నా, సముద్ర ప్రయాణాలన్నా ఎంతో ఇష్టపడేవాడు. కథలు వ్రాయడం అంటే ఎక్కువ సరదా పడేవాడు. వెర్నే తండ్రి ఒక న్యాయవాది. న్యాయశాస్త్రం చదివించాలని జూల్స్‌ను పారిస్ పంపారు. కాని వెర్నే రచనావ్యాసంగంలో మంచి నైపుణ్యాన్ని సంపాదించాడు, విజ్ఞానశాస్త్ర గ్రంథ రచయితల సంఘంలో సభ్యుడుగా చేరాడు. ఈ సంఘం బెలూన్ గురించి అనేక పరిశోధనలు చేసింది. జూల్స్ 'బెలూన్‌లో ఐదు వారాలు' (Five weeks in a balloon) అనే సాహసాత్మకమైన కథను వ్రాశాడు.

వెర్నేను విస్మరించలేరు. నేటికీ అతని కథలను చదవనివారు లేరు. ఈ నాడు మనం ప్రత్యక్షంగా చూస్తున్న అనేక క్రొత్త క్రొత్త వైజ్ఞానిక విషయాలను వెర్నే ఏనాడో తన కథలలో ముందుగానే వ్రాసాడు. ప్రపంచంలో వాయువిమానాలు జలాంతర్గాములు, టెలివిజన్, దూర శ్రవణులు ఉపయోగిస్తారని పూర్తిగా విశ్వసించిన కథారచయిత వెర్నే. "ట్వెంటీ థౌజండ్ లీగ్స్ అండర్ ది సీ" (Twenty Thousand Leagues under the Sea), "ప్రపంచం చుట్టూ ఎనభై రోజులలో" (Around the world in Eighty days) అనే రెండు కథలు సుప్ర

(మిగతా 36 వ పేజీలో)

## 150 పౌనుల మనిషి 2 టన్నులు!

సూర్యగ్రహంలో ఉండే బ్రహ్మాండమైన ద్రవ్యరాశి వల్ల ఇతర గ్రహాలు సూర్యుణ్ణి చుట్టూ సమీప కక్ష్యలో తిరుగుతున్నాయి కక్ష్యను దాటిపోలేవు. ఈ లాగుడు (Pull) శక్తిని తెలుసుకోవాలంటే సూర్యతలం దగ్గర 150 పౌండ్ల మనిషి సుమారు 2 టన్నుల బరువు ఉంటాడు అన్నమాట.

**"ఆశతో మాయలో పడి మోసపోవడం కంటే ఆశ పొందకుండా ఉండటం ఉత్తమం."**

# మొట్టమొదటి నక్షత్ర పరిశోధకశాల

భారతదేశంలో ఖగోళశాస్త్రం, భూగోళం, నౌకాయానం ప్రవృద్ధి చేయడానికి 1792 వ సం.లో ఈస్ట్ ఇండియా కంపెనీవారు మొట్ట మొదట మద్రాసులో నక్షత్ర పరిశోధక శాల (Observatory) ను స్థాపించారు.

ఈ మద్రాసు అబ్జర్వేటరీ సుమారు నూరు సంవత్సరాలు పైగా అపూర్వ పరిశోధనలను కావించింది. అనాడు ప్రభుత్వ ఖగోళ శాస్త్రజ్ఞుడైన టైలర్ (Taylor) 1844 వ సం.లో 11,000 నక్షత్రాలను ఖగోళంలో



గుర్తించి క్యాటలాగును తయారుచేసాడు. ఇక్కడ నుండే భారతదేశంలో కనిపించే సూర్యగ్రహణాలు పరిశీలింపబడ్డాయి. క్రమ క్రమంగా సౌర భౌతికశాస్త్రం Solar Physics ప్రవృద్ధి పొందింది. ఉష్ణప్రదేశాలలో ఖగోళ పరిశోధనలకు 19 వ శతాబ్దం ప్రారంభంలో కొడైకెనాల్ Kodaikanal) అబ్జర్వేటరీ స్థాపించబడింది. 1901 వ సం.లో ఎవర్‌షెడ్ (Evershed) అనే ఖగోళ శాస్త్రజ్ఞుడు 'సూర్యబింబంలో వర్తులం మధ్య కనిపించే మచ్చలను పరిశీలించి, కొడై కెనాల్ అబ్జర్వేటరీకి ప్రపంచ ప్రఖ్యాతి కల్గించాడు.

కొడైకెనాలునుంచి ఖగోళశాస్త్రజ్ఞుల ఉత్తర ఆర్కాటుజిల్లా వానియంబాడి దగ్గర జవ్వాది కొండలమీద కావలూరుకు తరలి వచ్చారు. ఇక్కడే ప్రపంచంలో మిక్కిలి ఎక్కువ శక్తివంతమైన దూరదర్శిని ఏర్పాటు చేయబడింది. ఆసియాలో కంతా పెద్దదైన ఈ దూరదర్శిని ఖగోళశాస్త్రంలో భారత దేశపు గత వైభవాన్ని ఒక్కసారి జ్ఞాపకం చేస్తుంది.

( 35 వ పేజీ తరువాయి)

సిద్ధమైనవి. బహుజనామోదమైనవి. ముఖ్యంగా రెండవ కథ తొలిసారి పారిస్ న్యూస్‌పేపరులో సశేష కథగా ప్రచురింపబడి ప్రజాదరణ పొందింది. ఆ కథలో కథానాయకుడు ఫిలీస్‌ఫాగ్ (Phileas Fogg వంటి హీరో నిజంగా ఉంటాడా అని ఆశ్చర్యపోతారు.

వెర్నే తన మనోభావాలను, సేకరించిన ఇతర అపూర్వ విషయాలను ఒక చిన్న నోట్‌బుక్‌లో వ్రాసిపెట్టుకునేవాడు. వీటిని కథలలో ఉపయోగించాడు. అతడి గదిలో పెద్ద వరల్డ్ మ్యాప్ ఉంది. దానిమీద తన హీరోలు ప్రయాణం చేసిన మార్గాలు వివరంగా చూపబడి ఉన్నాయి. ఇతడు 77 వ ఏట ఫ్రాన్స్, అమీన్స్ (Amiens) లో మరణించే నాటికి 50 కి పైగా గ్రంథాలు రచించాడు.

"వాగ్వాదంలో మూర్ఖచిత్తుని ఓడించడం దుస్సాధ్యం."

# సుఖం సాధించాలంటే?

శ్రీ దలాయ్ లామా

ప్రస్తుతం మనం సుఖం - అంటే నిష్క-ళంకమైన, [illegible]మైన, అచ్చమైన సౌఖ్యం మానసిక శాంతి ఎలా సాధించు కోవాలి అన్న విషయం తర్కించుకోవాలి. బౌద్ధ ధర్మాన్ని అనుసరిస్తూ వివిధ కష్టాలను అనుభవించిన నాకు సౌఖ్యం పొందడం అనేది కేవలం వ్యక్తిగత మానసిక ప్రవృత్తి అని తోస్తూంది. మనోభావాలు గానీ, మానసిక ప్రవృత్తులు గానీ సక్రమ మార్గంలో



కాకుండా అడ్డుదారులు తొక్కితే ప్రతీ చిన్న విషయానికి చిరచిరలాడిపోతూ అగ్రహంతో, కోపంతో రెచ్చిపోతారు. అటి వారికి ఈర్ష్య, అసూయ, క్రోధం మొదలైనవి మనస్సులో చెలరేగిపోతాయి. సుఖం పొందడానికి ఎంత అనుకూలవంతమైన ప్రశాంత వాతావరణం ఉన్నా వారికి మానసిక శాంతి దుర్లభం. కానీ మనోభావాలు శాంతియుతమై నిరామయంగా నెమ్మదిగా ఉంటే

ఎంతటి ప్రతికూల పరిస్థితులలోనైనా [illegible] నిబ్బరానికి భంగం కలుగదు. [illegible]ఖ్యసాధనకు మానసిక ప్రవృత్తే అధారం కాబట్టి మనస్సును స్వాధీనం చేసుకుంటే శాంతికి అనుకూల పరిస్థితులను ప్రవృద్ధి చేసుకోవచ్చు.

భౌతిక శరీరాన్ని పరిశీలించండి. భౌతిక శరీరం జబ్బుతో నీరసించిపోతే రోగ నిరోధక శక్తి పోతుంది. అనేక రోగాలు పట్టుకుంటాయి. ముఖ్యమైన శరీరం పటుత్వం బలిష్ఠంగా ఉంటే, రోగాల ప్రాబల్యం తగ్గిపోతుంది. ఆరోగ్యవంతమైన జీవితాన్ని సాగించగలం. అదే విధంగా మనస్సున నిబ్బరంగా కలతలు లేకుండా నెమ్మది చేసకుంటే బాహ్యపరిస్థితుల ప్రభావం ఎంత మాత్రం ఉండదు. మనస్సు, బుద్ధి, చిత్తం

## ప్రపంచంలో 6,40,000 పోస్టాఫీసులు

ప్రతీ సంవత్సరం ప్రపంచంలో 4,80[illegible] మిలియను మంది 3 20 000 మిలియన వస్తువులను పోస్టు ద్వారా పంపుతారు. ఈ బృహత్ కార్యాన్ని ప్రపంచంలో 5 మిలియన్ మంది పోస్టాఫీసు ఉద్యోగస్థులు, 6,40,00[illegible] పోస్టుఆఫీసుల ద్వారా జరుపుతారు. సగటు[illegible] ప్రపంచంలో ప్రతీ 7,500 మందికి ఒ[illegible] పోస్టాఫీసు ఉంది.

"శక్తి, ఉత్సాహం, ధైర్యం, సాహసం, సహనం అనంతమైనప్పుడు మహోన్నత ఉద్యమాలు సులభసాధ్యాలు."

సర్వం సుఖమయమవుతుంది. మనస్సు అనారోగ్యంగా నీరసించిపోతే సమస్యలు, కష్టాలు ప్రాబల్యం పొంది మనస్సును వశం చేసుకుంటాయి. అట్టి సమయాలలో మంచిని అభిలషించే స్నేహితులు కూడా చికాకు కలిగిస్తున్నారనే-భావన ఏర్పడుతుంది.

దయాదాక్షిణ్యం. ప్రేమ, అనురాగం, కారుణ్యం వంటి మృదుభావాలతో మానసిక ప్రవృత్తిని అభివృద్ధికరంగా మార్చుకోవచ్చని వివిధ మతాలు వివరిస్తున్నాయి. ప్రేమానురాగాలను ప్రవృద్ధి చేసుకుని సర్వ సౌభ్రాతృత్వంతో మానవ లోకమంతా స్వకుటుంబం అనే మానవీయతను పెంచుకుంటే బ్రహ్మాండమైన సుస్థిర మనోబలం కలుగుతుంది. అదే నీకు నెమ్మది కలిగిస్తుంది. మనోమందిరాన్ని నిరామయం చేసుకుంటే మహాద్భుత కార్యాలు కూడా అవలీలగా కొనసాగిపోతాయి. అహంకారంతో ఈసడించుకుపోయి క్రోధావేశాలతో కావేశాలతో మనస్సు మగ్గిపోతే బుద్ధి తీక్షణత, కుశలత చురుకుదనం నశించిపోతాయి. అప్పుడు అన్నీ విఘ్నాలే, అన్నీ పొరపాట్లే సంభవిస్తాయి. కాబట్టి అంతర్దేశీయంగా, జాతీయంగా, వ్యక్తిగతంగా ఆంతరంగిక సామరస్యం అత్యవసరం. కోపం, క్రోధం, కావేశం, ఆవేశం, ఈర్ష్య, అసూయ మొదలైన భావాలు అంకురిస్తే వెంటనే మానసిక శాంతికి భంగం కలుగుతుంది. ప్రతి ఒక్కరు మానవ మాత్రులుగా, విశ్వైక కుటుంబ సభ్యులుగా మెలగడం నేర్చుకుంటే భావశుద్ధితో శాంతి సౌఖ్యాలు అనుభవించగలరు.

## వివేకవల్లరి



విలువలో వజ్రాలను మించింది వివేకం.

* * *

కళ్ళతో చూడటం కాదు లోచూపుతో, దూరదృష్టితో చూడడం వివేకం.

* * *

లభించిన వాటికన్నా ఎక్కువ అవకాశాలను కల్పించుకోవడం వివేకం.

* * *

కుటుంబంలో శాంతిని, సౌఖ్యాన్ని కలిగిస్తాయి భార్య సహనం, భర్త వివేకం.

* * *

అత్యుత్తమ ధ్యేయాలను ఉత్తమ మార్గాలలో సాధించడం వివేకం.

* * *

వెంటనే జ్ఞానోదయం కలుగవచ్చు, విలకడగా మెల్లిగా వికసిస్తుంది వివేకం.

* * *

ఏది సర్వోత్తమమైనదో దానిని తెలుసుకోడం, ఏది చేస్తే మంచిదో దాన్ని చేయడం వాస్తవమైన వివేకం.

"పరాజయం కలుగుతుందనే భయంలేని
నిర్భయత్వమే వాస్తవమైన విజయం."

# నాణ్యతకు తిరుగులేదు

ఒక్కొక్కప్పుడు అతి అల్ప విషయాలు కూడా బ్రహ్మాండమైన పరిణామానికి కారణ భూతమవుతాయి. అమెరికాలో రైలు ఇంజనులను తయారుచేసే ఒక గొప్ప సాంకేతిక నిపుణుడైన ఇంజనీరు ఒక విదేశీ ప్రభుత్వంతో సంబంధం పెట్టుకుని పెద్ద కాంట్రాక్టును పూర్తిచేయడానికి సిద్ధపడి బయలుదేరి దారిలో లండనులో మజిలీ చేసాడు. సంప్రదింపులు సవ్యంగా సాగలేదు. సరకులను వీలైనంత తక్కువ ధరకు లభింపజేయాలనే ఉద్దేశంతో ఇంజనుల తయారీకి నాశిరకం లోహం ఉపయోగించడానికి కాతాదారులతో తీర్మానించారు. ఈ తీర్మానానికి అనుమతిస్తేనే గానీ కాంట్రాక్టు చేయిజారిపోతుంది. గత్యంతరం లేకపోయింది.

లండన్ హోటలు నుంచి బయలుదేరి బజారులోకి వెళ్ళాడు. ఒక షాపులో ఒక బట్ట చూచాడు. దాంతో అందమైన స్పోర్ట్స్ దుస్తులు కుట్టించుకోవాలనుకున్నాడు. బట్ట కొనుక్కున్నాడు, ఇంతలో లండనులో ఒక మిత్రుడు మంచి టైలరు అడ్రసు ఇచ్చాడు. ఆ టైలరు కొట్టు చూసి ఇంజనీరు ఎంతో మోజు పడి కుట్టించుకుందామని టైలరుని కలుసుకున్నాడు.

టైలరు ఆ బట్ట మడత విప్పకుండానే ఒక కొసక్రింద చేతి నాలుగు వ్రేళ్ళు పెట్టుకుని పైన బొటన వ్రేళ్ళతో వ్రాస్తూ పరీక్షించి నేను కుట్టను అనడంతోటే అమెరికను ఇంజనీరుకి ఆశ్చర్యం కలిగింది. నాశిరకం బట్ట కుట్టి దానిమీద తన లేబిల్‌ను అతికించడానికి టైలరు మనసు ఒప్పలేదు. బట్ట కొనేసాడు కాబట్టి సూటు కుట్టి తయారుచే[సి] లేబిల్ పెట్టకుండా ఇమ్మన్నాడు ఇంజనీరు ఆ తక్కువరకం బట్టను కుట్టడం తన కుట్టు పనివారి గౌరవ మర్యాదలకు లోపం అ[ని] చెప్పి కుట్టడానికి నిరాకరించాడు టైలరు.

ఇంజనీరు తల వంచుకు బయలుదేరాడు కోపం రాలేదు. తీవ్రంగా ఆలోచించాడు తన ఇంజను మీద అతికించిన నేమ్ ప్లేటు, బట్టలకు కుట్టిన టైలరు లేబిల్ వస్తునాణ్యత పనివారల నైపుణ్యం తెలియజేస్తాయి అ[ని] తెలుసుకున్నాడు. అప్రయత్నంగా అనుకో[ కుండా] టైలరు ఆ ఇంజనీరుని సక్రమ మార్గంలో పెట్టగలిగాడు.

## ప్రపంచంలో అతి పెద్ద వాయు విమానం



రష్యాలో తయారైన ఆంటోనోవ్-12 ప్రపంచంలోనే మిక్కిలి పెద్ద వాయు విమానం. 73 మీటర్ల నిడివి రెక్కలు గ[ల] ఈ విమానం 150 టన్నుల భారాన్ని 800 కి.మీ. దూరం వరకు రవాణా చేయగలద[ు] దీని లాండింగ్ గియరుకి 24 టైరు[లు] అమర్చబడ్డాయి.

---

"కదురు, కవ్వము ఆడితే కరువు ఉండదు."

# కలం స్నేహితులు

(మీ పేరు, వయస్సు, చిరునామా, హాబీలు ఈ శీర్షిక క్రింద ప్రచురించబడాలంటే తగిన వివరాలతో సహా రూ. 5/-లు మనియార్డరు ద్వారా పంపండి. —సంపాదకుడు.)

1 . సి హెచ్. శ్రీనివాసులు, ఎం. కాం, 27 సం. లు, సిండికేట్ బ్యాంక్, దొనకొండ (ప్రకాశం జిల్లా) 523 305.
సారస్వతము, కళలు.

2 మలిశెట్టి శ్రీనివాసులు, బి.ఏ., శివాలయం దగ్గర, ఇం. నెం. 5-159, మహాత్మాగాంధీ రోడ్డు, కదిరి, (అనంతపురం జిల్లా) 515 591.
పత్రికలు చదవడం, చిత్రలేఖనం, క్రికెట్ కామెంట్రీ వినడం.

3 ఆర్ పాండు. 18 సం. లు, లద్నూర్ పోస్టు. చైత్యాల తాలూకా (వరంగల్ జిల్లా) 506 224.
పుస్తక పఠనం, కవిత్వం వ్రాయడం, ప్రకృతి ఆరాధన.

4 జి. శ్రీనివాసరాజు. 19 సం. లు, బి.కామ్., రెండవ సంవత్సరం, రామాయణపురం, గొల్లవాని తిప్ప పోస్టు, భీమవరం తాలూకా (ప.గో. జిల్లా)
రేడియో వినడం. పేపర్లు చదవడం, సినిమాలు చూడడం.

5. బి. రవికిరణ్, 15 సం. లు, ఇం. నెం. 1044. రమేష్‌నగర్, గోదావరి ఖని పోస్టు, (కరీంనగర్ జిల్లా) 505 209.
కలంస్నేహం, పత్రికలు చదవడం, సినిమాలు చూడడం.

6. ఆర్. శేఖర్‌రెడ్డి, 19 సం. లు, ఇంటర్, C/o లెప్రసి హెల్త్ సెంటర్, దుప్పలపల్లి రోడ్. నల్గొండ-508 001.
అందరితో స్నేహం, పత్రికలు చదవడం, పాటలు పాడడం.

## భారతదేశపు కార్మిక వ్యవస్థలో మహిళల పాత్ర



వ్యవసాయం, ప్లాంటేషన్ మొదలైన కార్యకలాపాలలో తప్ప మిగిలిన పారిశ్రామిక రంగాలన్నిటిలో భారతదేశపు మహిళలు 15 శాతం ఉన్నారు. వ్యవసాయ రంగానికి చెందని కార్యకలాపాలలో నగర ప్రాంతాలలో కంటే గ్రామీణ ప్రాంతాలలో స్త్రీల ప్రాతినిధ్యం ఎక్కువ.

('ఇండియన్ ఎకనామిక్ సెన్సస్. 1980 సౌజన్యంతో)

"వేదాంతికి జ్ఞానమయమైన బ్రహ్మమే కవికి రసమయము."

# కంగారు పడకుండా మాట్లాడాలంటే?

ఎంత గొప్ప ప్రతిభావంతులైనా బహిరంగ ఉపన్యాసాలలో భయపడిపోతారు. వణుకు పుడుతుంది. మాటలకు తడుముకుంటారు. కంగారుపడిపోతారు. కంగారు పడకుండా రంగస్థలం మీద నిర్భయంగా మాట్లాడడానికి కొన్ని ఉపాయాలు:

1. తయారు చేసుకోకపోవడం: దీని వల్ల మాటలు తడుముకోడం, తడబడటం, సంశయం కలుగుతుంది.



నివారణ: క్షుణ్ణంగా మొదటె ప్రయత్నించి తయారుచేసి సిద్ధపరచుకోవాలి. దీనికి మొదట ప్రసంగించవలసిన అంశానికి హద్దు మీరిపోకుండా అవధులు ఏర్పరచుకో. పునాదుల దగ్గరనుంచి చెప్పదలచుకున్న దానిని పరిశోధించుకుంటే విషయ పరిచయం బాగా ఏర్పడుతుంది. ప్రసంగాన్ని ఉపోద్ఘాతం, ముఖ్య విమర్శనా విషయం, ఉపసంహారణ అని మూడు భాగాలుగా విభజించుకో. అంటే క్రమపద్ధతిగా ప్రసంగాన్ని ముందు పొందికపరచుకో. తరువాత అనుష్ఠానంతో అభ్యాసం చేసుకుని అలవాటుచేసుకో. కాలపరిమితిని నిర్ణయించుకో. నీ అంతట నీవు పరీక్షించుకో నీ ప్రసంగాన్ని గట్టిగా పదిమంది స్నేహిత లకు వినిపించు. టేపు రికార్డు తయార చేసుకో.

2. భయము/వణుకు: ఉపన్యాస వేది మీద నిలబడగానే ఉపన్యాసం ప్రారంభిం డానికి ముందు భయం ఆవహిస్తుంది ఒళ్ళంతా చెమటలు పట్టేస్తుంది. కాళ్ళుచేతుల పీళ్ళు కారతాయి.

నివారణ: నరాల బలహీనతకు లొం పోకు. ధైర్యంగా "నేను చేయగలిగినద ప్రదర్శించుకోడానికి ఇదే మంచి అవకాశం' అని ధైర్యంచెప్పుకో. అప్పుడు నరాల సత్తు నీకు ఎంతో లాభదాయకంగా ఉంటుంది.

3. పాదాలు చూసుకునే అలవాటు ఏదో ఒక దురభ్యాసానికి అలవాటు ప పోయిన వారు మాట్లాడుతుంటే మా మాటికి పొడిదగ్గు బయలుదేరుతుంది. ఉ న్యాసం సాఫీగా సాగదు. పాదాలను చూ కుంటుంటారు.

నివారణ: సభలో కూర్చున్న వా నందరినీ ఒక్కసారి చూడు. నిన్ను నీ మరచిపో. అలా మరచిపోగలిగినప్పుడు నీ ఎంతో మేలు కలుగుతుంది. ఒక ధనభావాని ప్రతిబింబించుకో. ప్రతిశ్రోత ముగ్ధుడు అ పోతున్నాడనుకో. చెప్పేదానికి తగినట్టు అభినయం ప్రారంభించు. నీ దృష్టిని సభ నాలుగు దిక్కులకు ప్రసరించు. నాలు వైపులా ఒక ధీమాగా, తీవిగా తిలకించ ప్రసంగించేటప్పుడు తొందరపడిపోకుం

"గొప్పగా ఉండటం గొప్పే, కాని దయకలిగి ఉండడం ఇంకా గొప్ప." —విల్ రోజర్స్

సావధానంగా ప్రవర్తించు. మొదట నీవు క్రమపద్ధతిలో అభ్యాసం చేసుకున్న వేగానికి, విధానానికి, స్థాయికి కట్టుబడి ఉండు.

అప్రయత్నంగా సిద్ధం చేసుకోకుండా ఆశువుగా మాట్లాడమంటే ధైర్యంగా రెండు మూడుసార్లు దీర్ఘంగా ఊపిరి పీల్చుకో. చెప్పవలసిన ఆలోచనలను క్రోడీకరించుకో. చెప్పవలసిన అభిప్రాయాలను ఎంత తక్కువ చేసుకుంటే అంతమంచిది. అభిప్రాయాలను కుదించుకోవాలి. మధ్య మధ్య ప్రశ్నలను అడిగి శ్రోతలకు నీ ప్రసంగంలో శ్రద్ధ ఏర్పడేటట్లు ప్రయత్నించు. దృష్టిని వివిధ వ్యక్తుల మీద కేంద్రీకరిస్తూండు.

4. తీవ్రమైన మందకొడితనం దీని వల్ల అశ్రద్ధ, అజాగ్రత్త ఏర్పడుతుంది. స్వప్నసంచారం ప్రారంభిస్తారు.

నివారణ: ఎటెన్షన్ 'శ్రద్ధగా వినండి' అని ప్రారంభించి ఒక మంచి సామెత, సూక్తి లేకపోతే హాస్యమైన చిన్నకథచెప్పు. నీ వ్యాఖ్యానాలను విడివిడిగా సుస్పష్టంగా విశదంగా పరిస్ఫుటంగా చేసుకో. శ్రోతలు అర్థం చేసుకోడానికి అవకాశం కలిగిస్తూండు. దీనివల్ల శ్రోతలు చాలామంది నీతో ఏకీభవిస్తారు. నీ భావాలతో ఐక్యతను పొందుతారు.

5. సర్కిల్ సిన్‌డ్రోమ్: విషవలయ భావం వల్ల సమతత్వం నశించిపోతుంది. తిరిగి తిరిగి ఎన్నిసార్లు చెప్పినా మొదట చెప్పిన అంశానికి వస్తూండటం ఒక దురలవాటు.

నివారణ: కుశలత గలిగిన వక్త ఎప్పుడూ రుజుమార్గంలో ముందుకు పోతూంటాడు. శ్రోతలకు నిశ్చిత ధ్యేయాన్ని చూపిస్తూ ఆ మార్గంలో ముందుకు పోవడానికి ప్రయత్నిస్తాడు. నీవు చెప్పదలచుకున్న విషయంలో శ్రోతలకు కుతూహలం కలిగించి సులభంగా అవగాహన చేసుకునేటట్లు ఉండాలి.

6. రక్తికట్టని ఉపసంహరణ: ఎంత జాగ్రత్తగా ప్రసంగం ప్రారంభించారో అంత జాగ్రత్తగాను ఉపసంహరణకు ఉపక్రమించాలి.

నివారణ: నీ అంతిమ నిర్ణయాలే సభాసదుల మనస్సులలో చిరస్థాయిగా నాటుకు పోతాయి. కాబట్టి మొదట చెప్పిన నిర్ణయానికి తిరిగివెళ్ళు. వివిధ అంశాలను ఒక్కొక్కటే పూసగుచ్చినట్లు తిరిగి జ్ఞాపకంచేయి. ఇదే నీ ప్రసంగాన్ని పటిష్ఠవంతం చేసుకో గలిగిన సదవకాశం.

బహిరంగంగా ప్రసంగంచే నైపుణ్యం, కుశలత సంపాదించుకోకుండా ఏ కొద్దిమంది మాత్రమే వివిధ రంగాలలో కీర్తిని పొంద గలుగుతున్నారు. కాబట్టి బహిరంగోపన్యాసాలను, ప్రసంగాలను సక్రమంగా అభ్యాసం చేసుకుని కార్యరంగంలోకి ఉపక్రమించు. ఈ విధంగా అనుసరించడంవల్ల శ్రోతలపట్ల, నీ ప్రసంగంపట్ల నీవు జాగ్రత్త పడుతున్నావని ప్రకటించుకో గలుగుతావు.

## రోజుకి 300 మిలియను డాలర్లు ఆదాయం

ప్రపంచంలో పెట్రోలు ఎగుమతిలో 25 శాతం పశ్చిమ ఆసియాలోని సౌదీ అరేబియాదే. సౌదీ అరేబియాకి దీనివల్ల దినసరి ఆదాయం 300 మిలియను డాలర్లు.

"నానాభావ సమన్వితమైన లోక వృత్తమునకు అనుకరణమే నాట్యము."

# మన రాష్ట్రాలు

## జెయ్‌పూర్

రాజకుమారుడు, గొప్ప సైనికుడు సుప్రసిద్ధ ఖగోళ శాస్త్రజ్ఞుడు, నిర్మాణ చతురుడు అగు సవాయ్ జెయ్‌సింగ్ (1699-1743) పేరున జెయ్‌పూర్ నగర నిర్మాణం జరిగింది.

ఒక్క దక్షిణదిక్కు తప్ప జెయ్‌పూర్



అన్ని వైపుల కొండలతో, బ్రహ్మాండమైన కోటలతో బురుజులతో నిండిన గోడలతో ఆవరింపబడి ఉంది.

ఉత్తర దక్షిణాలుగాను, తూర్పు పడమరలుగాను పెద్ద పెద్ద వీధులతో నగరం వరుసలుతీరి దీర్ఘ చతురస్రాకారంలో ఉంటుంది. ఈ వరుసలలో తిరిగి చిన్న చిన్న వీధులు ఏర్పరచబడ్డాయి.

200 సంవత్సరాలు గతించినా నేటికీ జెయ్‌పూర్ ప్రాచీన సౌందర్యం, వాతావరణం మార్పు చెందలేదు. నగర రాజభవనం పెద్ద పెద్ద గోడలతో నగరంలో ఏడవ వంతు వైశాల్యం ఆక్రమిస్తుంది. 1900 సం. లో 2వ మహారాజా సవాయ్ మధోసింగ్ నిర్మించిన ముబారక్ మహల్ ఈ భవనంలోనే ఉంది. దీనిపట్టూ సున్నితంగా చెక్కబడి అమర్చిన పాలరాతి కుడ్యచిత్రములు అతి నాజూకుగా జెయ్‌పూర్ వైభవాన్ని చాటుతున్నాయి.

దర్బారు హాల్ ప్రత్యేకంగా మహారాజా సేకరించిన చిత్తరువులతో అలంకరింబడింది. ముఖ్యంగా రాజస్థాన్ క ఖండాలు, జెయ్‌పూర్ రాజవంశానికి చెంది కొందరి రాజుల చిత్రాలు, రాధాకృ

## భారతదేశంలో 12 లక్షల క్యాన్సరు రోగులు

ఇండియన్ క్యాన్సర్ సొసైటీ వారి వివరాల ప్రకారం ప్రతి 8 మంది భారతీయులలో ఒక్కడు క్యాన్సరు వ్యాధికి గురి అవుతున్నాడు. దేశం మొత్తంమీద 12 లక్షల క్యాన్సరు రోగులున్నారు. ముఖ్యంగా 50 సం॥ ల వయస్సు గలవారిలో యీ రోగం అధికంగా ఉంటుంది. నోటి మరియు ఊపిరితిత్తుల సంబంధమైన క్యాన్సరు సిగరెట్లు కాల్చడం, పొగాకు నమలడంవల్ల వస్తుంది. బీడీలు కాల్చడం, సిగరెట్లు కాల్చడం కంటే రెండు రెట్లు ఎక్కువ అపాయకరం.

"అధిక సౌభాగ్యంతో కాదు తక్కువ కోరికల్లోనే సంతృప్తి."

నాట్యము, వివిధ రాగముల భంగిమలను ప్రదర్శించే "రాగమాల" చిత్రములు మిక్కిలి అపురూపమైనవి. ప్రాచ్యలిఖిత గ్రంథాలలో మొగలాయి వంశానికి చెందిన అక్బరు చక్రవర్తి స్నేహితుడు, చరిత్ర కారుడు అగు అబుల్‌పజల్ పర్షియన్ భాష లోకి అనువదించిన 'రజ్‌మన్నామా' (Razmnamah) మహాభారత అనువాదం అత్యంత అమూల్యమైనది. అరబ్బీ భాషలో యూక్లిడ్ వ్రాసిన ఎలిమెంట్స్ అఫ్ 'జామెట్రీ (రేఖాగణితం)కి సంస్కృత అను



వాదం కూడా ఇచ్చట గలదు.

రాజభవనంలో మరియొక అద్భుత కట్టడం 7 అంతస్థుల చంద్రమహల్. వివిధ వర్ణ చిత్రాలతో, పువ్వుల అలంకరణలతో, అద్ద ములు అమర్చిన గోడలతో, పై కప్పుల చిత్రాలంకరణలతో అలరారుచుండెడి ఈ చంద్రమహల్ పలువురు జెయ్‌పూరు రాజు లచే నిర్మించబడింది.

రాజభవనం ఆవరణములో సవాయ్ జెయ్‌సింగ్ । నిర్మించిన యంత్రమనబడే ఖగోళ పరిశోధనాలయం ఉంది. స్థానిక సమయం. సూర్యుని ఉచ్ఛ మరియు డెక్లి నేషన స్థిరనక్షత్రాల మరియు గ్రహాల డెక్లి నేషన్ మొదలైన గ్రహగతులను తెలుసుకో డానికి గ్రహణాలను గణించడానికి వీలుగా ఇది నిర్మింపబడింది.

జెయ్‌పూర్ నగరం మధ్య భాగంలో గల 'హవామహల్' (గాలిమేడ) 1799 వ సం.లో మహారాజా సవాయ్ ప్రతాప్‌సింగ్‌చే నిర్మింపబడింది. అత్యంత శోభాయమానమైన ఈ మహల్ నిర్మాణం ఎంతో రమణీయంగా ఉంటుంది. కల్పనా చాతుర్యంతో అత్యంత సుందరమైన స్థూపాకారంలో 5 అంతస్థులు కలిగి, వ్రేలాడే అర్ధాష్టభుజ గవాక్షాలతో వల

## 63 సంవత్సరాలు జీవించిన కవలలు

ఆగ్నేయ ఆసియా (థాయ్‌లాండ్) లో చైనా దంపతులకు 1811 వ సం. రంలో చాంగ్ (Chang) ఎంగ్ (Eng) అనే కవ లలు పుట్టారు. వీరికి ఛాతీ ఎముక మాత్రం చేరి ఉంది. ఇతర అంగాలు అన్నీ విడివిడిగా ఉన్నాయి. అనేక సంవత్సరాలపాటు ఒక సర్కస్ బృందంతో ప్రపంచం అంతా చుట్టి అమెరికా నార్త్ కరోలినాలో వ్యవసాయం చేసుకుంటూ స్థిరపడిపోయారు. ఏట్స్ (Yates) రైతుయొక్క ఇద్దరు కుమార్తెలను ఏకకాలంలో వివాహం చేసుకున్నారు. 1874 వ సం. రం. జనవరి 17 వ తేదీన ఒకరు మరణించగా, కవలలలో రెండవవాడు రెండుగంటల తరువాత మరణించాడు.

"అన్నీ తెలిసినవారికి, దేన్ని గురించి ఆలోచన లేనివారికి ఏ బాధా లేదు."

తెరలతో బురుజులు మొదలైన వింత నిర్మాణాలతో విరాజిల్లుతూంటుంది.

జెయ్‌పూర్ పురావస్తు ప్రదర్శనశాల (మ్యూజియం) రామ్‌నివాస్ గార్డెన్స్‌లో ఉంది. ఈ మ్యూజియంలో కళాత్మకమైన చేతిపరిశ్రమలకు సంబంధించిన వస్తువులు భద్రపరచబడి ఉన్నాయి. వీటిలో ముఖ్యమైనది 1632వ సం.లో మీర్జా రాజా జెయ్‌సింగ్ సంగ్రహించిన పర్షియన్ తోటను ప్రదర్శించే తివాసీ. ఇది అతి పురాతనమైనది. ప్రపంచంలోనే అత్యంత అమూల్యమైనది, అపురూపమైనది.



నగిషీలు చెక్కి ఎనామిల్ పూతలు, పొదిగిన ఇత్తడి సామానులకు జెయ్‌పూర్ మిక్కిలి ప్రసిద్ధి పొందింది. బంగారు వస్తువులమీద ఎనామిల్ పూతలకు, వజ్రాల కోతలకు కూడా ఇది చాలా ప్రసిద్ధి పొందింది. ఇచ్చట పనివారల హస్తకళా నైపుణ్యాన్ని ప్రకటించే జెయ్‌పూర్ పాలరాతి విగ్రహాలు, దంతపు సామానులు ప్రపంచ ప్రఖ్యాతిని పొందాయి. ఇంతేగాక నూలు బట్టల అద్దకాలకు, పట్టు, నూలు బట్టలకు పై అండ్డై పనులకు, తివాసీలకు, లక్క గాజులకు, కాగితపు గుజ్జుతో తయారైన వస్తువులకు జెయ్‌పూర్ పేరు పొందింది.

## మెట్ట వేదాంతం

ఒక గురువుగారు తన ప్రియశిష్యుడికి "సర్వం బ్రహ్మమయం", బ్రహ్మ సర్వవ్యాపి అని బోధించాడు. శిష్యుడు దాన్ని మక్కీకి మక్కి అర్థం చేసుకున్నాడు. అందులో ఉండే అంతరార్థాన్ని గ్రహించలేదు. ఒకనాడు ఆ శిష్యుడు రోడ్డుమీద నడిచిపోతూండగా ఒక పెద్ద ఏనుగు ఎదురైంది. ఏనుగుమీద మావటివాడు 'దారి దారి, తప్పుకోండి' అని అరుస్తున్నాడు. వీధిలో వచ్చిపోయేవారు అందరూ అటు ఇటు తప్పుకుని ఏనుగుకి దారి ఇస్తున్నారు. సర్వం బ్రహ్మమయం అని తెలుసుకున్న శిష్యుడు మాత్రం "నేనెందుకు తప్పుకోవాలి? నేను బ్రహ్మని. ఏనుగు బ్రహ్మము. పరస్పరం ఏమి అపాయం" అని వితర్కించుకుని దారిలో నడిరోడ్డుమీద నిలబడ్డాడు. ఇటు కదలడు, అటు కదలడు. ఊగుకుంటూ ఠీవిగా ఏనుగు గబగబా నడుస్తూ దారిలో ఉన్న ఆ శిష్యుని తొండంతో చుట్టి పట్టుకుని ప్రక్కకు విసిరి కొట్టింది. శిష్యుడికి బాగా గాయాలు తగిలాయి. మెల్లిగా గురువుగారి దగ్గరకు వెళ్ళాడు. జరిగిన విషయం వివరంగా చెప్పాడు. గురువుగారు "నాయనా మంచిది, నీవూ బ్రహ్మమే. ఏనుగూ బ్రహ్మమే. ఏనుగు మీద మావటి బ్రహ్మం నిన్ను తప్పుకోమన్నాడు. మావటి బ్రహ్మం మాట ఎందుకు వినలేదు" అని మందలించారు.

—శ్రీరామకృష్ణ

**"దేశాధినేతల మాటల విశిష్టార్థాలు సామాన్యులకు బోధపడవు."**

# నువ్వు నువ్వుగానే ప్రవర్తించాలి

నార్మన్ విన్సెంట్ పీల్

జీవితాన్ని ఫలప్రదం చేసుకోవాలంటే ఒకటే ఒక మార్గం. నిన్ను నీవు ఉద్ధరించుకోవాలి. నువ్వు నువ్వుగా ప్రవర్తించాలి. నీ ప్రత్యేక వ్యక్తిత్వాన్ని నువ్వు ప్రకటించుకోవాలి. ఇతరులకు బానిసవు అయిపోకూడదు. ఇరుగు పొరుగువాళ్ళు నీ మాట సాగనీయక పోతే ఎలాగ అని తెల్లబోకు. వాళ్ళూ నీ వంటి వాళ్ళే, భయపడకు. ప్రత్యేకత వ్యక్తిత్వాన్ని పెంచుతుంది.



ఒక స్నేహితుడు తన జీవితాన్ని సుఖంగా గడుపుకుంటున్నాడు. ఇతనికి తన వ్యక్తిత్వాన్ని ప్రదర్శించుకోవానికి తగిన ధైర్యం, కావలసినంత వివేకం ఉంది. క్రిందటి సంవత్సరం ఉన్నట్టుండి అతడు మూరెడు గడ్డం పెంచేశాడు. తరువాత యథాలాపంగా అతని రోడ్డుమీద కలిసినప్పుడు పరిహాసం చేసాను. నా గడ్డానికి ఒక పెద్ద కథ ఉంది, విను. “ఎంతోమంది నన్ను చూచిన వాళ్ళంతా నన్ను పేపుకు తినేసారు. గడ్డం పెంచేసావు. గతి వక్రించిందా లేక గర్వ దీక్ష అని అందరూ అడిగేవారే. నా గడ్డాన్ని గురించి మా ఆవిడ అభిప్రాయం ఏమిటి అని అడిగారు కొంతమంది. గడ్డం పెంచుకున్నందు వల్ల ఉద్యోగంలో మార్పులు వచ్చాయా? ఏదైనా అంతరాయం కలిగిందా తెలుసుకోవాలని తాపత్రయంతో తహతహలాడిపోయారు” అన్నాడు.

నిజంగా లోకం విచిత్రంగా కనిపిస్తుంది. ఎవరిపని వారు చూచుకోడానికి బదులు ఇతరుల విషయాలలో ఉన్నదానికీ, లేనిదానికీ అనవసరంగా జోక్యం కలిగించుకుంటారు. ఇతరులు ఏమనుకుంటున్నారో అనే భయం, స్నేహితులు విడిచి పెట్టేస్తారనే ఆందోళన, దీంతో జీవితం పరాధీనం అయిపోతుంది. ఎవరికి వారు తమ వ్యక్తిత్వాన్ని ప్రకటించుకోడానికి

## ప్రపంచంలో ఇనుప ఖనిజానికి భారతదేశం నాల్గవస్థానం

భారతదేశంలో ప్రస్తుతం ఉన్న ఇనుప ఖనిజం ఉత్పత్తిని 80 లేక 90 టన్నుల స్థాయికి రెట్టింపు చేసినా ఇంకా 100 సంవత్సరాల దాకా సరిపోతుంది. దేశంలో ఇనుప ఖనిజ వనరులు 17,678 మిలియను టన్నులని అంచనా వేయబడింది. రష్యా, బ్రెజీలు, ఆస్ట్రేలియా తరువాత భారతదేశం నాల్గవస్థానం ఆక్రమిస్తుంది.

“నిసర్గ మనోహరమగు వస్తువును యథాతథముగా
శ కి లౌకికులకు లేదు.

ప్రయత్నించరు ఎవరికివారు ఉద్ధరించుకోవాలి.

సాధారణంగా ధైర్యసాహసాలు ఉన్నవాళ్ళు ఇంకొకరిని లెక్కచేయరు జీవితాన్ని పరాధీనం చేసుకోరు. పరావశులు అయిపోరు. ఇటువంటివారు వివేకవంతమైన సక్రమ నిర్ణయాలను తీసుకుంటారు. అన్ని విషయాలను నిష్కర్షగా తమకు తామే పరిష్కారం చేసుకుంటారు. "ఇతరులు ఏమంటారో అని చింతపడిపోరు. దీనిని ఉత్తమ విధానంలో పరిష్కారం చేసుకోడం ఎలా" అని తర్కించుకుంటారు. ప్రపంచంలో నీవు ఒక్కడివేకాదు. భగవంతుడు ఎంతోమందిని సృష్టించాడు. మనిషిని పోలిన మనిషి ఉండడు. అందరూ ఒకే విధంగా ఉండరు. ఎవరి వ్యక్తిత్వం వారిది. వైవిధ్యాల మధ్యలో ప్రతి ఒక్కరిదీ తిరిగి మరో అపురూప వైవిధ్యమే. కాబట్టి నిజమైన సంసిద్ధిని పొందాలంటే నువ్వు నువ్వుగా ప్రవర్తించాలి. నీ ప్రత్యేకతను నీవు ప్రదర్శించుకోవాలి. ఇదే ఉత్తమ మార్గం.

మనం చేసేపనులకు, సాధనలకు ఇతరులు మార్గం చూపి నడిపిస్తున్నారంటే మన వ్యక్తిత్వం నశించిపోయింది అన్నమాటే. ఎంతోమంది వైను, టీ, కాఫీలు తాగడం సమాజగౌరవం అనుకుంటారు. ఇంకా కొంతమంది నిద్రమాత్రలు వేసుకుంటే మెహర్బాని అనుకుంటారు.

నీ తోటివారు చెప్పిన మార్గం అనుసరించడానికి బదులు సర్వశక్తిమంతుడు, అనంత జ్ఞానమూర్తి అయిన భగవంతుడు, మనలను సదా దివ్య ప్రేమానురాగాలతో కనిపెట్టుకుని ఉండే పరమాత్ముడు చూపిన త్రోవ ఎందుక పట్టుకోకూడదు? మన నిత్య జీవితంలో దివ్య ప్రభావం పెరుగుతూన్నకొద్దీ ఇతరుల పలుక బడి అధికార ప్రభావం మన మీద తగ్గిపోతుంది. ఎవరి వ్యక్తిత్వాన్ని వారు ప్రకటించుకుంటుంటే పరమాత్మునికి పరమానందం. ఒకరికి తోచింది ఇంకొకరికి తోచదు. ఒకరికి రుచించినది ఇంకొకరికి రుచించదు. పుర్రెకు ఒక గుణం, జిహ్వకు ఒక రుచి అన్నారు. ఇంకొకరి కోసం నీ స్వభావాన్ని నీవు మార్చుకో నక్కరలేదు.

## పిల్లులకు "మార్గజ్ఞానం" అమోఘం



పిల్లులకు అమోఘమైన 'మార్గజ్ఞానం ఉంది. ఐర్లాండ్‌లో ఒక అపురూపమై ప్రయోగం చేసారు. రాబ్ కెల్లిండర్ అతడి పెంపుడు పిల్లి పాట్రిక్‌ను తీసుకె ఎక్కడో 200 కి.మీ ల దూరంలో వది పెట్టారు. అహోరాత్రాలు అతి చాకచక్యంగ ఆ పిల్లి తన యజమానిని త్రోవ తప్పకుండ తిరిగి ఇంటిపట్టుకి చేర్చింది.

('మిషా' సౌజన్యంతో

"ఆత్మ నివేదనతో, అల్పసంతుష్టి పొందువారు ధన్యజీవులు."

# విజ్ఞానవేదిక

## ధ్వని అంటే ఏమిటి?

ధ్వని అంటే శబ్దం. కాని అన్ని శబ్దాలు ధ్వని కానక్కర్లేదు. సంకీర్ణమైన శబ్ద ...లం, రణగోల, రకరకాల చప్పుడులు, ...బ్దాలు, సందడులు, మోతలు వివిధ స్థాయి ...లో కలిసి ధ్వని ఏర్పడుతుంది. ఇదే గోల ...ని చెప్పుకోవచ్చు. గాలిలోగానీ, ఇతర ...మానకములలో గానీ క్రమబద్ధముగాని అవధు ...లో సంకోచనాలవల్ల ధ్వని జనిస్తుంది. అర ...జను గాజుగ్లాసులు పైనుంచి నేలమీద



...కారవేసినప్పుడు రకరకాల శబ్దాలు పుట్టి ధ్వని ...ర్పడుతుంది.

అప్రస్తుతమైన అనవసర శబ్దజాలం ధ్వని ...ని నిర్వచించవచ్చు. మద్దెలను ఒక గాన ...భలో సకాలంలో పాటకు తాళబద్ధంగా ...ాయించినప్పుడు సుశ్రావ్యమైన సంగీతధ్వని ...ర్పడుతుంది. కానీ అదే మద్దెల అర్ధరాత్రి ...మయంలో మీ ప్రక్క ఇంటి ఆసామి ...ంట్లో 'ధిమి ధిమిత' అని వాయిస్తుంటే ...మిటీ ధ్వని, గోల అని విసుక్కుంటారు.

చెవికి ఇంపుగా ఉండే కొన్ని శబ్దాలు శృతి తప్పి సరిగా కలవనప్పుడు గోల బయలుదేరుతుంది. గోలగా ఉండే ధ్వని మనకి చాలా అపకారం చేస్తుంది. విసుగు పుట్టిస్తుంది. గగ్గోలుగా ఉండే గదులలోను, ప్రదేశాలలోను పనిచేసేవారు నిశ్శబ్దమైన వాతావరణంలో పనిచేసే వారికంటే సుమారు 25 శాతం అసమర్థులుగా ఉంటారని శాస్త్రజ్ఞులు, పరిశోధనలవల్ల తేల్చారు.

ధ్వనియొక్క తీవ్రతను మనం కొలవవచ్చు. ధ్వని ప్రమాణాన్ని డెసిబిల్స్‌లో కొలుస్తారు. పది డెసిబిల్స్ ప్రమాణం గుసగుసలాడే శబ్దం. సామాన్యంగా గోల లేకుండా నిశ్శబ్దమైన వీధిలో శబ్దప్రమాణం 20 డెసిబిల్స్. కిటికీ తలుపులు మూసుకుని తిరిగే కార్లలో గానీ, సాధారణంగా ఒక గదిలో మాట్లాడుకునే శబ్దం 50 డెసిబిల్స్ ఉంటుంది. పెద్ద ధ్వనితో ప్రయాణంచేసే విమానం 90 డెసిబిల్స్ ధ్వనిని జనింపచేస్తుంది.

### ప్రపంచంలో మిక్కిలి పెద్ద పురాణం

ప్రపంచపు శాస్త్రాలన్నింటిలోను భగవద్గీత మిక్కిలి చిన్నది. పురాణాలలో మహాభారతం చాలా పెద్దది. దీనిలో సుమారు 3 మిలియను మాటలు, నూరువేల శ్లోకాలు ఉన్నాయి.

"సప్తస్వరాలలో అపశ్రుతి దొర్లకుండా ఆలాపన శుద్ధంగా ఉండటం విశేషం."

# జిప్సీలు

మానవలోకంలో వివిధ జాతులున్నాయి. వాటిలో జిప్సీలు ఒకటి. ప్రపంచమే వీరి నివాసం. వీరికి ప్రత్యేకంగా ఒక దేశమంటూ ఉండదు. వీరు దేశద్రిమ్మరులు. ఒక ప్రదేశం నుంచి మరో ప్రదేశానికి తిరుగుతూంటారు. యూరపు, ఉత్తరఆఫ్రికా, పశ్చిమ ఆసియా, అమెరికా మొదలైన దేశాలలో ఎక్కువగా కనిపిస్తూంటారు. మొత్తం సుమారు ఆరుమిలియను మంది జిప్సీలు ఉన్నారు. ఆరుమిలియను మందిలో మూడు



మిలియను మంది ఇటీవల కొద్ది దశాబ్దాలుగా స్థిరనివాసాలు ఏర్పరచుకున్నారు. మిగిలినవారు ఇంకా దేశద్రిమ్మరులుగానే ఉన్నారు. యూరపులో వీరిని సాధారణంగా "జిప్సీస్" (Gipsies) అన్నా, వివిధ దేశాలలో వివిధ పేర్లతో తిరుగుతూన్న బొహిమియనులు, ఫిలిప్పైయినులు, సింగనీస్, టార్టారులు మొదలైన వారంతా ఈజాతికి చెందినవారే.

జిప్సీలు రూపురేఖలలో సామాన్యంగా యూరపు దేశస్థులవలెగాక హిందువులనుపోలి ఉంటారు. సుమారు 1750 వ సం లో హంగేరీలో వాల్యి ఇస్తవాన్ (Valyi Istavan) అనే కాల్వినిస్ట్ (Calvinist) మతాధికారి లెయ్‌డెన్ యూనివర్శిటీలో కొంతమంది భారతీయ విద్యార్థులను సంప్రదించి వారు మాట్లాడే భాషలో సుమారు వెయ్యి పదాల దాకా తూర్పుయూరపులో జిప్సీలు మాట్లాడుకునే పదాలని నిర్ణయించాడు. 1850 వ సం. లో జిప్సీ వ్యాకరణాన్ని రచించిన ఆస్ట్రియా. హంగేరీ ఆర్చ్‌డ్యూక్ జోసెఫ్ జర్మనీకి చెందిన జిప్సీలు 'జిందూ' (Zindu) లని చెప్పుకుంటారని, ఈ జిందూ అనే పదం "హిందూ" అనే పదం అయి ఉండాలని నిర్ణయించాడు. 5 వ శతాబ్దంలో పర్షియన్ చక్రవర్తి 12 వేల 'జాట్' లను తనదేశానికి

## విమాన రవాణాకు వీలైన ఆపరేషన్ థియేటరు

ఒక చోటు నుంచి మరో చోటుకి సౌలభ్యంగా ఇమిడికగా విమానం మీద రవాణా చేయడానికి వీలుగా క్లినికాప్టర్ (Clinic Copter) ఆపరేషన్ థియేటరును ఒక జర్మన్ సంస్థ నిర్మించింది. తేలికైన లోహాలతో 1½ టన్నుల బరువుండే ఈ థియేటరులో మధ్యరకం శస్త్రచికిత్సలు చేయడానికి అన్ని హంగులు సదుపాయాలు ఉన్నాయి. దీనిని హెలికాప్టర్ సహాయంతో కావలసిన ప్రదేశానికి చేరవేయవచ్చు.

"ఆదర్శాలు గొప్పవైనంతమాత్రాన ప్రయోజనంలేదు. ఆచరణలో చిత్తశుద్ధితో అమలుపరుస్తేనేతప్ప సార్థకం కావన్న స్పృహముఖ్యం."

తరలించాడు. తరువాత సిరియాను జయించిన బైజాంటైనులు (Byzantines) 27 వేలకు పైగా జాట్‌లను ఖైదీలుగా తీసుకువచ్చారు. జాట్‌లు చాలామంది దేశద్రిమ్మరులుగా పట్టుబడి ఉండాలి. లేకపోతే వీరికిగల అపూర్వ సంగీతాభిలాష, గాన నైపుణ్యం వల్ల బానిసలుగా పట్టుబడి ఉండాలి. యూరపులో నివసించే జిప్సీలలో చాలామంది ఇంకా శ్రావ్యంగా పాడుతూంటారు. మధ్య యుగంలో యూరపురాజులు, డ్యూక్‌లు ఈ జిప్సీలను తమ ఆస్థానాలకు ఆహ్వానించి తమ వినోదం కొరకు వారిచే సంగీతం పాడించి, అభినయాన్ని చేయించి ఆనందించేవారు. వారికి తగిన సత్కారంచేసి ఒకదేశాన్నుంచి మరోదేశానికి విచ్చలవిడిగా తిరగడానికి స్వేచ్ఛను కలిగించేవారు. కాని కాలక్రమేణా వీరిని దేశాంతరాలకు పంపి అనేక విధాల కష్టాలు, ఉపద్రవాలు కలిగించే దేశద్రోహులని ఉరితీయించేవారు. హిట్లరు అధిపత్యంలో నాజీ జర్మనీలోను, ఇతర స్వాధీనం చేసుకున్న ప్రదేశాలలోను వీరిని ప్రత్యేక విషవాయువులు నిండిన వాయుమందిరాల (Gas chambers) లోకి బలవంతంగా త్రోసి జ్యూలను హింసించినట్టు హింసిస్తూండేవారు. ఇటీవల యూరపు దేశాలలో జిప్సీలను కనికరంతో, మానవీయతతో, ఆదరాభిమానాలతో గౌరవిస్తున్నారు. జిప్సీల దేశద్రిమ్మరితనాన్ని మాన్పించి ఇతర మానవులతోపాటు వీరికి స్థిరనివాసాలు ఏర్పాటు చేయడానికి ప్రయత్నాలు కొనసాగుతున్నాయి.

పంజాబుకు చెందిన భిక్కు చమన్‌లాల్ ప్రపంచం అంతా ప్రయాణంచేసి తాను ఒక 'జిప్సీ'గా మారి జిప్సీలలో గల అనేక ఆచార వ్యవహారాలను పరిశీలించి పుస్తకరూపంలో వ్రాసాడు. ఈ జిప్సీలు మొదట తాము భారత దేశానికి చెందినవారమని, తిరిగి తమ స్వదేశానికి వచ్చి స్థిరనివాసాలు ఏర్పాటు చేసుకోగలమనే ఆశయాన్ని ప్రకటించి ఇతడికి ఆహ్లాదాన్ని కలిగించారు.

## 6 మిలియను మంది చూసిన 'ది మౌస్‌ట్రాప్'



AGATHA CHRISTIE

అగాథా క్రిస్టీ రచించిన 'ది మౌస్‌ట్రాప్' అనే మర్డర్ మిస్టరీ నవలను అనుసరించి ప్రదర్శించిన 4000 నాటక ప్రదర్శనలలోను ఉపయోగింపబడిన 0.38 కాలిబర్ కోల్ట్ రివాల్వరు ఇటీవళ 600 పౌండ్లు (సుమారు రూ. 9000 లు) కు వేలం వేయబడింది. 10 మిలియను పౌండ్ల బాక్సాఫీసు ఆదాయాన్ని గణించుకున్న "ది మౌస్‌ట్రాప్" నాటకాన్ని సుమారు 6 మిలియను మంది ప్రేక్షకులు చూసి ఆనందించారు. ప్రపంచంలో చాలా ఎక్కువ రోజులు ఆడిన నాటకం ఇదే.

"మంచిపనులు చేయాలనే అభిలాష ఉన్నా
భౌతికసిద్ధి లేనిదే ప్రయోజనం శూన్యం."

# నూతన విద్యా విధానం

ప్రాతన విద్యావిధానంలో ఆకర్షణీయమైన అపూర్వ లక్షణం నవోదయ విద్యాలయపథకం. సూత్రప్రాయంగా చెప్పాలంటే నవోదయా విద్యాలయా (ఆదర్శ పాఠశాలలు) ల యొక్క ముఖ్యోద్దేశములు మూడు: 1. జాతీయ సమైక్యతను అభివృద్ధిపరచుట. 2. ప్రాంతీభాష మాట్లాడే విద్యార్థులు మరో భారతీయ భాష నేర్చుకోవడానికి. ఇతర భారతీయ భాషలవారు హిందీ నేర్చడానికి వీలుగా త్రిభాషాసూత్రం తప్పనిసరిగా అమలుజరపడం. 3. అర్హులైన ప్రతిభావంతుల విద్యాభివృద్ధికీ, విజ్ఞానాభివృద్ధికీ నిష్పాక్షికమైన అవకాశాలు, అనుభవాలు కలిగించడం.



ఈ ఆదర్శ పాఠశాలలు ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలో ప్రత్యేకించి గ్రామీణ ప్రాంతాల పిల్లలకు ఉపయోగకరంగా ఉండేటట్లు స్థాపించబడతాయి. విద్యార్థుల ప్రతిభకు, వారి శక్తి సామర్థ్యాలకు తగిన వికాసానికి సహాకరిస్తారు. ఆడపిల్లలు, మగపిల్లలు కలిసికట్టుగా ఒకేచోట విద్యార్థులందరూ వసతి గృహాలలో ఉంటారు. నమోదైన విద్యార్థులలో మూడవ వంతు ఆడపిల్లలై ఉండాలి. ముమ్ముందు స్త్రీల విద్యాభివృద్ధికి అధిక ప్రాముఖ్యత ఇవ్వడమే దీని ముఖ్యోద్దేశం.

1990వ సంవత్సరం నాటికి మొత్తం సుమారు 428 పాఠశాలలు దేశమంతటా వ్యాపించి ఉంటాయి. దేశంలో ప్రతీ జిల్లాలోను ఒక ఆదర్శ పాఠశాల నెలకొల్పబడి ఉంటుంది. ఈ ఆదర్శ పాఠశాలలో చేరి చదివే విద్యార్థులకు వసతి సౌకర్యాలతోపాటు యూనిఫారములు, పుస్తకాలు, నోటుపుస్తకాలు ఉచితం. ఇంతేగాకుండా ఇంటినుండి

## అద్భుత ఫలితాలను ప్రసాదించిన మాయ మాట

పౌరసంబంధాలలో నిపుణులు జీవితంలో విజయం సాధించడానికి ముఖ్యాంశాలలో "అభిప్రాయా"నికి ప్రాముఖ్యతను ఇస్తారు. జీవితంలో నాయక పాత్రలకు ఇతర ప్రముఖ వ్యక్తులకు ఈ "మాయ మాటే" బ్రహ్మాండమైన ఫలితాలను కలిగిస్తుంది. అమెరికా మనస్తత్వ శాస్త్రజ్ఞులలో ప్రసిద్ధుడైన విలియం జేమ్స్ - మానవమాత్రులు తమ మానసిక "అభిప్రాయా"లను మార్చుకుని తమ జీవితాలనే పూర్తిగా మార్చుకోగలరు - అనేదే మా జీవితంలో కనుగొన్న గొప్ప విషయం అనే అభిప్రాయం వెలిబుచ్చాడు.

"లో వెలుగు ప్రకాశవంతం అవుతూంటే అది విశ్వవ్యాప్తంగా ప్రకాశిస్తుంది."

పాఠశాలకు, పాఠశాలనుండి ఇంటికి ప్రయాణం ఖర్చులు కూడా ఉచితం.

ప్రతీ ఆదర్శ పాఠశాలలో ఉన్నత విద్యా ప్రమాణాలకు దోహదమిచ్చే సదుపాయాలన్నిటినీ కలిగిస్తారు. రేడియో, టీవీ, మైక్రో కంప్యూటర్లు మొదలైన ఆధునిక విద్యా సదుపాయాలు ఉంటాయి.

ఆదర్శ పాఠశాలలో ముఖ్యంగా మానవ జీవితానికి సంబంధించిన విషయాలు (హ్యూమానిటీస్), విజ్ఞానం, కామర్సు మరియు వ్యక్తి వ్యాపార సంబంధమైన విభాగాలు ఉంటాయి ఆటలు, క్రీడలు, యోగ, సాంస్కృతిక కార్యకలాపాలు. చిత్రకళ, నాట్యకళ, సంగీతం, మరియు ఇతర లలిత కళలకు ప్రాముఖ్యత నిస్తారు. విద్యార్థులు వసతి గృహాలలో ఉంటారు కాబట్టి పాఠ్యేతర అంశాలకు కూడా ప్రాధాన్యత ఉంటుంది. సామాన్యంగా పరిసర పారిశుభ్రత, వృక్షములు, చెట్లు నాటి తోటలు పెంచుట, సమాజ జీవితం మొదలైనవి విద్యార్థులు నేర్చుకోవాలి.

క్రమశిక్షణతో ఉండే గౌరవం, సామూహిక జీవనం మొదలైన వాటికి సంబంధించిన ప్రణాళికలు ఏర్పరుస్తారు. విద్యావిధానంలో వసతిగృహాలు లేక హాస్టల్స్‌లో జీవితం ముఖ్యంగా గుర్తింపజేసి అదికూడా విద్యావిధానంలో ప్రథానాంశంగా గ్రహింపజేస్తారు. ఆర్థిక సంబంధమైన అసమానతా భావం విద్యార్థులలో అభివృద్ధి కాకుండా జాగ్రత్త వహిస్తారు; వ్యక్తిత్వ నిర్మాణానికి, విద్యాభివృద్ధికి సహకరిస్తారు.

## భారతదేశపు జింకకు మెలితిరిగిన నిడుపాటి కొమ్ములు



జింకలను ఇండియన్ ఆంటిలోప్ (Indian Antelope), బ్లాక్‌బక్ (Black Buck) అంటారు. ఇవి భారతదేశం అంతటా మైదానాలలో విస్తారంగా విచ్చలవిడిగా తిరుగుతాయి. మగ జింకలు నల్లగానూ, ఆడజింకలు ఇసుక రంగులోను ఉంటాయి రెంటికీ శరీరం క్రింది భాగంలో తెలుపురంగు ఉంటుంది. మగ జింకలకు మాత్రం 46 మొదలు 55 సెం.మీ. లు నిడుపాటి మెలితిరిగిన కొమ్ములు పెరుగుతాయి. ఇవి ఒక్కొక్కప్పుడు 79 సెం.మీ. ల దాకా ఉంటాయి. ఆడజింకలకు కొమ్ములుండవు.

## సున్నంపాలు తగ్గితే అపాయం

ఆహారంలో చాలా తక్కువగా సున్నం ఉపయోగిస్తే రక్తపుపోటు అధికమయే సూచనలు ఉన్నాయని అమెరికాలో ఒరేగాన్ హెల్త్ సైన్సెస్ యూనివర్సిటీవారు నిర్ధారించారు.

"విశ్వప్రమాణాలను పెంచుకోడానికిముందు వ్యక్తిగత ప్రమాణాలు పెరగాలి."

# ఆర్కిటిక్ వలయంలో మూడు నెలలు పగలు

ప్రతి 24 గంటలు పగలు, రాత్రి అని రెండు భాగాలుగా విభజింపబడింది. భూమధ్య రేఖ దగ్గర రెండు భాగాలూ సరిసమానంగా ఉంటాయి. ఉత్తరార్ధగోళంలో వేసవి కాలమందు పగటికాలాలు దీర్ఘంగా ఉంటాయి. శీతకాలంలో రాత్రిళ్ళు దీర్ఘంగా ఉంటాయి.

ఉత్తరదిక్కున ఆర్కిటిక్ వలయంలో మాత్రం పరిస్థితులు దీనికి భిన్నంగా



ఉంటాయి. ఇక్కడ వేసవిలో పగలు మూడు నెలలపాటు ఉంటుంది. సూర్యుడు ఈ మూడు నెలలు అసలు అస్తమించడు. శీతకాలంలో ఏకంగా మూడునెలలపాటు సూర్యుడు ఉదయించడు. చీకటిగానే ఉంటుంది. ఇందువలన సోవియెట్ ద్వీపకల్పం కామ్‌చట్కాలో, అమెరికా అలాస్కా (Alaska) లోని నార్యన్‌మార్ (Naryan Mar) లో, మర్మాన్స్క్ (Murmansk) నగరాలలో నార్వే, ఫిన్‌లాండ్ ఉత్తరభాగాలలో సంవత్సరంలో మూడుమాసాలు నిరంతరం విద్యుద్దీపాలు అలా వెలుగుతూ ఉంటాయి.

ఆర్కిటిక్ వలయానికి ఇంకా ఉత్తర దిక్కుగా 'ఉత్తరజ్యోతులు' (Northern Lights) ప్రకాశిస్తూండటం మరో వింత. కటికచీకటి మంచురాత్రులలో అకస్మాత్తుగా ఉన్నట్టుండి వెలుగులు ప్రకాశిస్తాయి. ఈ జ్యోతులు నాటకరంగంలో తెరమీద పడిన వెలుగు సప్తవర్ణాలతో ప్రకాశిస్తున్నట్టు ప్రకాశిస్తాయి. మంచు, మంచు గడ్డలు అమూల్యమైన వజ్రాలలా మెరుస్తాయి. జనం దీన్ని చూసి "బ్రహ్మాండమైన మహాద్భుతం" అని ఆశ్చర్యపోతారు.

సౌరవాయువులు (Solar winds) తెల్లగా ప్రజ్వలిస్తూన్న సూర్యతలం మీద నుంచి బయలుదేరిన సూక్ష్మకణాలవల్ల ఈ ఉత్తర జ్యోతులు ఏర్పడుతున్నాయని శాస్త్రజ్ఞుల అభిప్రాయం.

ఇవి అంతరాళంలో అనంతదూరాలు పయనిస్తూ వచ్చి భూమిని చేరతాయి. ఉత్తర దక్షిణ ధృవాలు అయస్కాంతాలవలె వీటిని ఆకర్షిస్తాయి. అందువల్ల భూగోళానికి ఉత్తరానికి ఇంకా ఉత్తరంగాను, దక్షిణానికి ఇంకా దక్షిణంగాను ఉన్న ఆకాశం వేడెక్కుతుంది. దీనివల్ల వాతావరణంలో ఉపరిభాగం ప్రకాశిస్తుంది. ఈ సౌరవాయువులు క్షీణించినప్పుడు ఉత్తర జ్యోతులు ఆరిపోతాయి

"ఆత్మస్తుతి వినాశానికి, ఆత్మ విమర్శ వికాసానికి దారితీస్తాయి."

# జాతీయవార్తలు

## తమిళనాడులో ఆసియా దేశపు ఏకైక అతి పెద్ద దూరదర్శిని:

తమిళనాడు కావలూరు నక్షత్ర పరిశోధక శాలలో పూర్తిగా దేశీయ సాధన సంపత్తులతో అమర్చబడిన దూరదర్శిని ఖగోళంలో పాలపుంత (Galaxy) యథార్థ స్థితిని తెలుసుకోడానికి ఉపయోగించబడుతుంది. పూర్తిగా పాలపుంత యొక్క మ్యాపును తయారుచేయడమే దీని ముఖ్యోద్దేశం. సుమారు 15 సంవత్సరాలపాటు పట్టే



ఈ కార్యక్రమం ప్రపంచంలో మొట్ట మొదటిది.

* * *

## ఆరు ఎరువుల కర్మాగారాలకు ఆఫ్‌షోర్ గ్యాస్ సరఫరా:

బొంబాయి తీర ఆవలి ప్రదేశాల నుండి ఉత్తరప్రదేశ్ దాకా ఉండే సువిశాల ప్రదేశంలో నెలకొల్పబడే ఆరు రసాయనిక ఎరువుల కర్మాగారాలకు గ్యాస్ సరఫరాచేసే హజీరా-బిజాయ్‌పూర్-జగదీష్‌పూర్ (HBJ) పైప్‌లైన్ 1730 కి.మీ. ల దూరం-నాలుగు రాష్ట్రాలమీదుగా వెడుతుంది.

* * *

## టూరిజం ద్వారా విదేశీ ఆదాయం రూ. 1300 కోట్లు!:

విలాసయాత్రలకై ఏర్పాటైన ప్రభుత్వ టూరిజం విభాగం ద్వారా 1984-'5 సం.లో పొందిన ఆదాయం రూ. 1,300 కోట్లు అని అంచనా వేయబడింది. 1983, 1984, 1985 వ సం.లలో వరుసగా భారతదేశాన్ని సందర్శించిన విలాసయాత్రికులు 884,731; 835,503 మరియు 836,906 మంది. 1984-85 వ సం. లో బ్రిటను నుంచి ఒక లక్షకు పైగా విలాస యాత్రికులు వచ్చారు.

* * *

## 5 వ తరం కంప్యూటర్లతో రోగనిదానం

అగ్రదేశాలలో పెద్ద పెద్ద హాస్పిటళ్ళలో రోగ నిదానానికి వైద్యులు 5 వ తరం కంప్యూటర్ల సహాయం తీసుకుంటున్నారు. రోగి చెప్పిన లక్షణాలను, వైద్యులు స్వయంగా రోగిని పరీక్షించి తెలుసుకున్న లక్షణాలను కంప్యూటర్లకు ఎక్కిస్తే ఆ సమాచారాలను కంప్యూటర్లు క్రోడీకరించి విశ్లేషిస్తాయి. రోగుల వ్యాధి నిర్ణయానికి ఇవి వైద్యుల కెంతో సహకరిస్తున్నాయి.

"ఉదారవంతులు తామిచ్చినదానిని మరచిపోవచ్చునేమోకాని
కృతజ్ఞులు పుచ్చుకున్నదానిని ఎన్నటికీ మరచిపోరు." —విలియం హెన్రీస్మిత్

## డిస్నీలాండ్ నమూనాలో పార్కు:

బొంబాయి పొలిమేరల్లో అనేక మిలియను రూపాయల ఖర్చుతో డిస్నీలాండ్ నమూనాలో (వినోద వనం) అమ్యూజ్మెంట్ పార్కు ఏర్పాటు చేయబడుతుంది. దీనికి ఎక్కువగా విదేశాలలో ఉండే భారతీయుల ధనసహాయానికి పూనుకున్నారు. మొత్తం దీనికి వ్యయం రూ. 15 కోట్లు.

* * *

## 1985-86 వ సం. లో 8.1 మిలియను పుట్టుకలు నివారించబడ్డాయి:

1984-85 వ సం. లో భారతదేశంలో నివారింపబడిన జననాలు 7.3 మిలియను. ఇదే 1985-86 వ సం.లో 8.1 మిలియను. ప్రభుత్వంలో ఆరోగ్య మరియు కుటుంబ సంక్షేమానికి సంబంధించిన విభాగంవారు 1990 నాటికి 60 శాతం దంపతులకు పూర్తిగా గర్భనిరోధక చర్యలు కలిగించడానికి ప్రయత్నాలు చేస్తున్నారు.

* * *

## హరప్పాకు పూర్వముండే ప్రదేశాలలో ద్రాక్ష గింజలు:

లక్నోలో వృక్షశాస్త్రానికి సంబంధించిన బీర్బల్ షాహ్ని ఇన్స్టిట్యూట్‌లో పరిశోధకులు సాంగ్రూర్ జిల్లాలో హరప్పాకు పూర్వముండే పంజాబ్ - రోహిరా (2300-2000 బి. సి.) మహోరానా (2000-1900 బి. సి.) ప్రదేశాలలో కనుగొన్న ద్రాక్షగింజలను పరిశీలించి హరప్పా కాలంనాటి వ్యాపార సరళిలో ద్రాక్ష ముఖ్యమైన వ్యాపార వస్తువని నిర్ధారించారు.

* * *

## గోధుమ అంకురాల నుండి 'ఇ' విటమిను:

మైసూరు కేంద్ర ఆహార మరియు సాంకేతిక పరిశోధక సంస్థ గోధుమ అంకురాల నుండి తీసిన వీట్ జెర్మ్ ఆయిల్ నుంచి సులభంగా విటమిను 'ఇ' ఉత్పాదించే విధానాన్ని కనిపెట్టారు. దీనివల్ల గోధుమలను దంపినప్పుడు విస్తారంగా పొట్టుతో పోయే పుష్టిదాయకమైన అంకురాలకు సద్వినియోగం కలుగుతుంది.

* * *

## న్యూఢిల్లీలో మెడికల్ ఫిజిక్స్ అకాడమీ:

క్రొత్తగా న్యూఢిల్లీలో మెడికల్ ఫిజిక్స్ అకాడమీ ఏర్పాటైంది. ఇది ముఖ్యంగా వైద్యశాస్త్రానికి సంబంధించిన భౌతికశాస్త్ర ప్రాముఖ్యతను పరిశీలిస్తుంది.

## ధర్మం అంటే ఏమిటి?

ధర్మం అంటే ఒక్క విశ్వాసం మాత్రమే కాదు, సత్ప్రవర్తన. ధర్మం మానవుని యందుండే పశుత్వాన్ని అంతరింపజేసి మానవునికి మానవత్వాన్ని సిద్ధింపజేస్తుంది. మానవజాతి అవసరాలను, మేధావంతుల ఆశయాలను సిద్ధింపజేసేదే ధర్మం.

—డా. ఎస్. రాధాకృష్ణ

"ఆత్మజ్యోతితో విహరిస్తేనే తప్ప జీవితానికి భద్రత ఉండదు."

# వీరిని గురించి తెలుసుకోండి

**మైథిలీ శరణ్ గుప్తా:**
ఉత్తరప్రదేశ్‌లో చీర్‌గోన్ గ్రామంలో జన్మించి హిందీ భాషలో సుప్రసిద్ధ కవిగా, రచయితగా పేరుపొందాడు. స్వాతంత్ర్య యోధుడుగా జాతీయోద్యమానికి, జాతీయ ఐక్యతకూ అమూల్యసేవ యొనర్చిన దేశాభిమాని.

**సర్దార్ వల్లభ్ భాయ్ పటేల్.**
అసమాన్యమైన రాజకీయ దురంధరుడు. బార్డోలీ సత్యాగ్రహాన్ని లేవదీసి తొలిసారి భారతదేశంలో బ్రిటిష ప్రభువుల పరువు ప్రతిష్ఠలకు భంగం కలిగించాడు.



స్వాతంత్ర్యం సిద్ధించినప్పుడు హోమ్ శాఖ మంత్రిగా దేశంలో వివిధ సంస్థానాలను, ఆస్థానాలను సంస్కరించి విలీనం చేసి, దేశానికి కనీవినీ ఎరుగని పటిష్ఠతను రూపొందించాడు. ఇతడు లేనిచో యావత్ భారత దేశానికి హైదరాబాదు కంటక ప్రాయంగా పరిణమించి ఉండేది.

**అంద్రిమారి అంపెరె (1775-1836):**
ఫ్రెంచిదేశపు భౌతికశాస్త్రవేత్త, గణిత శాస్త్రజ్ఞుడు. ఎలక్ట్రోడైనమిక్స్ (Electro-dynamics), విద్యుదయస్కాంత ధర్మాలు (Laws of electromagnetism) కనుగొన్నాడు. అయస్కాంత క్షేత్రానికి, అయస్కాంత క్షేత్రాన్ని జనింపజేసే విద్యుత్ ప్రవాహానికి గల సంబంధాన్ని వివరించిన ప్రజ్ఞావంతుడు.

* * *

**డీగో మరడోనా:**
ఈనాడు ప్రపంచంలో గొప్ప ఫుట్‌బాల్ ఆటగాడు. 1986 వ సం.లో మెక్సికో నగరంలో అర్జెంటీనా ఫుట్‌బాల్ జట్టు కాప్టెన్‌గా ప్రపంచ కప్పును గెలుచుకున్నాడు. లామస్ (బ్యూనస్ ఐరిస్) లో జన్మించి 16 వ సం. రం వయస్సులో మొదట ఆడడం ప్రారంభించాడు.

* * *

**వినూ మన్‌కడ్:**
క్రికెట్ ఆటలో గొప్ప పేరుపొందిన బాట్స్‌మన్, బౌలర్, ఫీల్డర్. కేవలం 23 టెస్టులలో 100 వికెట్లను సంపాదించి, 1000 పరుగులు గెలుచుకున్న క్రీడాకారుడు.

* * *

**కుర్ట్‌టాంక్:**
జర్మనీ దేశపు ప్రఖ్యాతి పొందిన ఎయిర్ క్రాఫ్ట్ డిజైనర్లలో ఒకడు. 1938వ సం. లో దూరప్రయాణానికి లాంగ్‌రేంజి నాలుగు ఇంజనుల 'కాండోర్' నిర్మించాడు. అట్లాంటిక్ మహాసముద్రం మీదుగా ఎకాయకీ ఎక్కడా ఆగకుండా ప్రయాణంచేసిన మొదటి ప్యాసింజరు విమానం ఇది. టాంక్ భారతీయ విమానదళానికి బెంగళూరులో జెట్‌ఫైటర్‌ను డిజైనుచేసి అభివృద్ధి పరచాడు.

"అవకాశాలను సద్వినియోగం చేసుకుంటేనే
ఆశించే సర్వతోముఖ వికాసం లభ్యం."

# పెరుగు - ఆయుర్వృద్ధి

పెరుగు, పెరుగుతో తయారైన లస్సీలు ఈ నాడు భారతదేశమందంతటా వాడుతున్నారు. విదేశాలలో కూడా పెరుగు అంటే చాలా వ్యామోహం బయలుదేరింది. ప్రతీ సంవత్సరం అమెరికాలో 25 కోట్ల కి.గ్రా.ల పెరుగు, పెరుగుతో తయారైన ఇతర ఫలహారాలు వాడుతున్నారు.

పెరుగు మానవుని జీవిత ప్రమాణాన్ని అధికం చేస్తుందని పరిశోధకులు తేల్చారు. పెరుగు సాధారణంగా ప్రేగులకు సంబంధించిన అనేక రోగాలను నివర్తిస్తుంది. ఒక చిన్న చెంచా మెంతులు అరకప్పు పెరుగులో నానబెట్టి తీసుకుంటే విరేచనాలు తగ్గుతాయి. ఒక పెద్ద చెంచా పెరుగు నేల ఉసిరిగ, మురికొండాకు రసంతో తీసుకుంటే జాండీసు (కామెర్లు) తగ్గుతాయి. శరీరంలో కొలెస్ట్రాల్ ప్రమాణాన్ని బాగా తగ్గించి బ్లడ్ ప్రెషరును తగ్గిస్తుంది. క్యాన్సరు వ్యాధికి దివ్య ఔషధంగా పని చేస్తుంది. మొత్తం మీద పెరుగు ఆరోగ్యకరం, ఆయుర్వృద్ధికరం. పెరుగు సౌందర్యవర్ధక సాధనం కూడా.



పెరుగును సంస్కృతంలో దధి అంటారు. దధి, క్షీరవికారం, మాంగల్య, క్షీరపిండక, నవనీతాంశు, కాంపిల్య, క్షీరసంభవ అనేవి పెరుగుకుగల పేర్లు. ఆయుర్వేదం ప్రకారం ఇది శీతలంగా ఉంటుంది. ఉష్ణము, రక్త పైత్యము, ప్రమేహము, కామిలను నివర్తింపజేసి శరీరపుష్టిని వీర్యవృద్ధిని కలిగిస్తుంది. పెరుగు మీది నీళ్ళను 'మస్తు' అంటారు. ఇది అనేక సాధారణ రోగాలను నివారిస్తుంది. కళ్ళకు చలవ చేస్తుంది. పెరుగుమీది మీగడను 'మండం' అంటారు. ఇది మంచి పుష్టికరం. పెరుగులో నీళ్ళుపోసి గిలకొట్టిన లేక చిలికిన మజ్జిగ నీటి ప్రమాణాన్ని బట్టి ఘోళకము, మధికము, ఉదశ్విత్తు, తక్రము అని మజ్జిగ నాలుగు రకాలు. పెరు

## చరిత్రలో బిరుదు వహించిన మిక్కిలి వృద్ధురాలు

**ప్రస్తుతం ఏకచ్ఛత్రాధిపత్యం వహిస్తున్న రెండవ మహారాణి ఎలిజబెత్ (1952వ సం.లో మరణించిన ఆరవ జార్జి చక్రవర్తి వితంతువు) తల్లి జూన్ 10, 1986 నాటికి 85 సం.ల 304 రోజుల వయస్సుతో చరిత్రలో 'మహారాణి మాత' (Queen Mother) అనే బిరుదు వహించిన మిక్కిలి వృద్ధురాలుగా పరిగణించబడింది.**

"విత్తు మంచిదైతే చెట్టు మంచిదవుతుంది."

గును చిలికి తీసిన ద్రవ్యము వెన్న. దీన్నే నవనీతము, నవోద్ధృతం అంటారు. వెన్నను కాస్తే నేయి లేక ఘృతం తయారవుతుంది. నెయ్యి కూడా బలవర్ధకం.

విస్తారంగా పెరుగు వాడకంవల్ల జెకోస్లోవేకియాలో నివసించే జనం దీర్ఘకాలం జీవించగలుగుతున్నారని రష్యా శాస్త్రజ్ఞుడైన మాచింకోవ్ పరిశోధనలు చేసి తెలుసుకున్నాడు.

వేదకాలంలో ఋషులు సోమరసంతో పాటు పెరుగును కలిపి సేవించేవారట. రాత్రిపూట పెరుగు తీసుకోకూడదని అనేక ప్రాచీన గ్రంథాలు తెలుపుతున్నాయి. కాని రాత్రిపూట పెరుగు తీసుకునేటప్పుడు పెరుగులో కొంచెం పంచదార కలిపి తీసుకోడం ఆరోగ్యకరం. పెరుగు మంచి పుష్టికరం, జీర్ణకారి, ఆకలి పుట్టిస్తుంది.

అనేక శుభసమయాలలో పెరుగు వాడతారు. చిన్న వెండి పళ్ళెంలో అన్నం ముద్దలు పెట్టి వాటిపై పెరుగు, పువ్వులు ఉంచి హారతి ఇస్తారు. దీనిని అవతార మంగళం అంటారు. సాధారణంగా దేవాలయాలలో విగ్రహాలకు పంచామృతం (పెరుగు, పాలు, తేనె, బెల్లం, నెయ్యి, అరటిపళ్ళు) అభిషేకం చేస్తారు.

దధ్యోదనం పెరుగు అన్నం, ఇదే దిగాళాబాత్. బగాళాబాత్ పుల్లగానూ, తియ్యగానూ కూడా తయారుచేసుకుంటారు. సంస్కృత మహాకవి కాళిదాసు తన గ్రంథాలలో శిఖరిణిని గురించి ప్రస్తావించాడు. ఏలకులు, లవంగాలు, ఇతర సువాసన ద్రవ్యాలు, పాలు, పంచదార చేర్చి వండి పెరుగు, పళ్ళు కలిపి శిఖర్లం తయారుచేస్తారు.

పాశ్చాత్య దేశాలలో పెరుగుతో అనేక ఫలహారాలు తయారుచేస్తారు. అమెరికాలో డెయిరీ డిపార్టుమెంటులో పెరుగుతో రకరకాల ఫలహారాలు అమ్ముతారు.

ఆఫ్రికాలో మసై జాతివారు ప్రతిదినం తప్పనిసరిగా పెరుగు వాడటంవల్ల వారిలో కొలెస్ట్రాల్ ప్రమాణం బాగా తగ్గిందని, దాని వల్ల వారిలో గుండెపోటువల్ల కలిగే మరణాలు చాలా తక్కువని పరిశోధకులు తెలుసుకున్నారు.

లింకన్ యూనివర్సిటీలో శాస్త్రజ్ఞులు పరిశోధనలు చేసి పెరుగువల్ల క్యాన్సరు రోగాలు 28 శాతందాకా తగ్గుతున్నాయని తెలుసుకున్నారు. పెరుగులో తక్కువ క్యాలరీలు ఉన్నాయని పెన్సిల్వేనియా పరిశోధకులు తమ అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

పోషక ఆహారంగా పెరుగులో కాల్షియం, మాంసకృత్తులు అధికంగా ఉంటాయి. సాధారణంగా పాలు త్రాగనివారు పెరుగు ధారాళంగా వాడవచ్చు. పెరుగులో విటమిను B-12, ఇతర ముఖ్య పోషకాంశాలు పుష్కలంగా లభిస్తాయి. ముఖ్యంగా గమనించవలసిన విషయం: నిలవ ఉంచిన పెరుగు, పులిసిపోయిన పెరుగు వాడకూడదు.

## భారతదేశంలో తలసరి అల్యూమినియం వినియోగం

భారతదేశంలో తలసరి అల్యూమినియం వినియోగం అర కి.గ్రా. కంటే తక్కువ. ఇదే అభివృద్ధిపొందిన కొన్ని దేశాలలో 22 కి.గ్రా.లు.

"నేలకు దుక్కిచలవే చలవ, బిడ్డకి తల్లిపాలే పాలు."

# పొరటీలు

ఫిబ్రవరి '1987

'విస్‌డమ్' పోటీలలో ఎవరైనా పాల్గొన వచ్చు. ఏ ఎంట్రీకాఎంట్రీ విడిగా పావుతావు సైజుకు తగ్గని కాగితంమీద వ్రాయాలి. ప్రతి ఎంట్రీమీద అడ్రసు ఉండాలి. ఒకే కాగితంమీద ఒకటి కంటే ఎక్కువ ఎంట్రీలు వ్రాస్తే పరిశీలించబడవు. సరియైన లేదా మేలైన ఎంట్రీలు చాలా ఉంటే లాటరీ పద్ధతిలో ఎన్నికైన ముగ్గురు విజేతలకు రూ. 15లు, రూ.10లు, రూ. 5 లు ఖరీదుచేసే పుస్తకాలు బహుమతులుగా పంపబడును. విజేతల ఎన్నికలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఎంట్రీలకు 'పోటీకూపన్' (ఒక ఎంట్రీకి ఒకటి) అంటించి పంపాలి. ఒక కూపన్‌తో ఒకేసారి ఎన్ని ఎంట్రీలయినా పంపవచ్చును. ఎంట్రీలు అందవలసిన ఆఖరుతేదీ ఫిబ్రవరి 20, 1987. పంపవలసిన చిరునామా: పోటీల నిర్వాహకుడు, తెలుగు 'విస్‌డమ్', 9, దేశికా రోడ్డు, మైలాపూరు, మద్రాసు-6000 04.

—సంపాదకుడు.

## వ్యాసం

'సహకారం ప్రగతి సాధకం' అనే అంశంమీద 300 మాటలకు మించకుండా వ్యాసం వ్రాసిపంపండి.

## క్విజ్

1. భిలాయ్ ఉక్కు కర్మాగారం ఏ దేశ సహకారంతో నిర్మించబడింది:

(ఎ) అమెరికా, (బి) యునైటెడ్ కింగ్‌డమ్, (సి) రష్యా, (డి) ప.జర్మనీ.

2. 1988 ఒలింపిక్ క్రీడలు ఎక్కడ నిర్వహించబడతాయి?

(ఎ) సియోల్, (బి) బైజింగ్, (సి) న్యూ ఢిల్లీ, (డి) మాస్కో.

3. భారతదేశంలో పెరిగిపోతూన్న జనాభాకి ముఖ్య కారణం:

(ఎ) అంటురోగాల నియంత్రణ మరియు నిరోధం, (బి) పుట్టుకరేటు పెరుగుదల, (సి) జనసామాన్యంలో ప్రబలిన అజ్ఞానం, (డి) తక్కువ మారకపు రేటు.

4. మీనాక్షి దేవాలయం ఎక్కడ ఉంది?

(ఎ) తమిళనాడు, (బి) కర్ణాటక, (సి) కేరళ.

5. ఆకుపంక్చర్ (Acupuncture) అంటే ఏమిటి?

6. ఏడవ పంచవర్ష ప్రణాళికలో అత్యధిక సొమ్ము దేనికి కేటాయించబడింది?

## జీవన విధానాలు ఆయుర్దాయాన్ని అధికం చేస్తాయి

ఉత్తమతరగతి ఆరోగ్య పరిస్థితులు, జీవన విధానాలు లభించే పారిశ్రామికాభివృద్ధి పొందిన దేశాలలో 60 సం. లు దాటిపై బడిన వయస్సు కలవారు దాదాపు ... శాతం.

"చిక్కిన అవకాశాలను వెంటనే వినియోగించుకోడానికి సంసిద్ధుడైన ... జీవితంలో విజయానికి రహస్యం తెలుసుకున్నవాడు." —డిస్‌రేలీ

(ఎ) వ్యవసాయము, (బి) పరిశ్రమలు, (సి) విద్యుత్ శక్తి ఉత్పాదన, (డి) సాంఘిక సేవ.

7. క్రిందివాటిలో ఏ నగరము భారత దేశానికి దక్షిణానికి దక్షిణ దిక్కుగా ఉంది?

(ఎ) బెంగళూరు, (బి) మద్రాసు, (సి) మంగుళూరు, (డి) తిరువనంతపురం.

8. 'క్యూ' (cue) అనే పదం ఏ ఆటకు సంబంధించినది?

(ఎ) క్రికెట్, (బి) బిలియర్డ్స్, (సి) ఫుట్ బాల్, (డి) టెన్నిస్.

## పజిల్




ఆధారాలు - అడ్డం: 1. ఆంధ్ర ప్రదేశ్‌లో కృష్ణానదికి ఆనుకుని ఉన్న ఒక శైవ దివ్యక్షేత్రం నల్లమల కొండలలో ఉంది, 3. ఏ వాఙ్మయంలోనైనా సంగీత సాహిత్య కళలలో మొదటిది ఆపాత మధుర మైతే రెండవది దీనితో కూడుకుని ఉంటుంది, 5. సూర్యోదయానికి పూర్వం 'నాలుగు గడియల కాలమున' వాతావరణం ప్రశాంతంగా ఉంటుంది. 6. చెప్పబోవు విషయాన్ని ఎరుగుజేయు ఉపోద్ఘాతము, 7. సింగారించుకుని అందంగా తళుకుతో, బెళుకుతో వీటుగా కదులు అని హెచ్చరింపు మాట, 9. పరస్పర యోగ్యతలు. అంతస్థులు ఇలా ఉంటే వధూవరుల దాంపత్య జీవితం అన్యోన్యంగా ఉంటుంది అంటే సందేహం ఉండదు, 10. రాముడు కాదు పాండవ మధ్యముడు, 12. సాధారణంగా ఇంతమంది చేరి వెళ్ళడం కార్యసిద్ధి కాదనేది మనలో మూఢ విశ్వాసం, 13. వృద్ధాప్యంలో వృద్ధులు కూర్చుండి అప్పుడప్పుడు కళ్ళు మూసి చేసే నిద్రలు. 14. గ్రహణాలలో సూర్యచంద్రులకు అడ్డముగా వచ్చే ఛాయా గ్రహం తలక్రిందులైంది.

నిలువు: 1. ఆంధ్రప్రదేశ్‌లో తిరుపతి దివ్యక్షేత్రం కలియుగవైకుంఠమైతే తమిళ నాడులో ఇది 'భూలోక వైకుంఠం', 2. సాధారణంగా ఇటువంటి బెండ, బ్రహ్మచారి నిరుపయోగం అని తెలుగు సామెత, 3. వీటినుండి అమూల్యమైన తైలాన్ని వండు తారు, 4. 'ఆధునికంగా' ఈనాడు అన్ని ఆఫీసులలోను కంప్యూటర్ల వాడకం పెరిగి పోతూంది. 5. వ్యర్థమైన ఆశలను పెట్టుకో వద్దు అని హెచ్చరించుట, 7. ఎర్రతామరలు, 8. మానవుని మనుగడలో తాపత్రయాలు లేని ప్రథమావస్థ. 9. వ్యక్తిగతంగా ఎవరికి వారు సరిదిద్దుకుంటే ఇది దానంతటదే చక్క దిద్దబడుతుంది. 10. 'స్త్రీ' అని అర్థమిచ్చే మాట, 11. వెనకనుంచి ముందుకు వచ్చిన లక్ష్మణాగ్రజుడు.

"స్వేచ్ఛా జీవిగా సృష్టించబడిన మానవుడు
తాను చేసిన కర్మలకు తానే కారకుడు."

—జీన్‌పాల్ సార్త్రే

## తెలివికి పరీక్ష

1. ఈ క్రింది మాటలు ఎవరు ఎవరితో పలికి ఉండవచ్చు? ఏ సందర్భంలో?

"పరస్పర విరోధములైన మాటలచే నా బుద్ధికి తొట్రుపాటు కలిగించుచున్నావు. నాకు నిశ్చయముగా శ్రేయము కలిగించు మార్గమును చెప్పుము."

2. అభ్యసించే విద్యకంటే, ఆర్జించే ధనధాన్యాదులకంటే, పొందే కీర్తి గౌరవాల కంటే, ఆచరించే ధర్మకార్యాలకంటే అధికంగా మానవుల జన్మను చరితార్థంచేసేది ఏది?

3. "బోడితలలో పిలక
బోసినవ్వుల మొలక
కలసియే మో పలుకు
కదలాయి లోకాలు."

ఇది ఎవరు వ్రాసినది? ఎవరమీద?

4. ఒక కార్యం నిమిత్తం వచ్చి ఆ కార్యాన్ని మరుగుపరచి యుంచుట అనే అర్థానికి తెలుగులో వాడే సామెత ఏది?

5. ఈ క్రింది వరుసలో తరువాత వచ్చే రెండు అంకెలు ఏవి?

8, 4, 7, 3, 6 2, — —

6. ఈ క్రింది ఖాళీని సరైన అంకెతో పూరించు:

3. 7, 15, 31 —

7. ఈ క్రింది బ్రాకెట్టును సరైన సంఖ్యతో పూరింపుము

164 (225) 286; 224 (   ) 476.

8. క్రిందివాటి అర్థములను తెలియజేయుటకు 'కడుపు' అను పదమును ఉపయోగిస్తూ తెలుగు జాతీయములను వ్రాయండి:

## ఏప్రిల్ ఉదయం
### పోటీల ఫలితాలు
### ఫిబ్రవరి 1987

(ఎ) ఉదరపోషణ ఆశ, (బి) శ్రమపడకుండా ఉండు, (సి) జీవనాధారము పడగొట్టు, (డి) వెల్లడి చేయకుండా రహస్యముగా ఉంచు.

## మాటల మహిమ

ఈ క్రింది మాటలకు సరియైన అర్థాన్ని అర్థాలను సూచించండి:

1. కొలువు : సేవ (ఎ) ఆస్థానము (బి), సభామందిరము (సి), దోపిడి (డి).

2. గడుసు : కఠినము (ఎ), గాఢము (బి), మొండితనము (సి), అవధి (డి).

3 కినుక : అల్పము (ఎ), ఇంచుక (బి), బాధ (సి), పీడ (డి).

4. మినుకు : తళతళ ప్రకాశించు (ఎ), గొణుగుకొను (బి), కిరణము (సి) పుప్తై (డి).

5. రివట : తిక్క (ఎ), ఉన్మాదము (బి), ఉపశాఖ (సి), రెమ్మ (డి).

6. మోసము : వంచన (ఎ) పొరపాటు (బి), అసత్యము (సి) అజ్ఞానము (డి).

## భారతదేశంలో పిన్‌కోడ్ నంబర్లు 1972 లో ప్రవేశ పెట్టబడ్డాయి

భారతదేశంలో పోస్ట్స్ అండ్ టెలిగ్రాఫ్ డిపార్టుమెంటు ఆగస్టు 15, 1972 న పోస్టల్ ఇండెక్స్ నంబరు పిన్ (Pin) ప్రవేశపెట్టింది.

"ప్రేమతో నా సర్వస్వాన్ని నీ కిచ్చుకు సమర్పించే శక్తి నాలో ప్రేరేపించు." ....... —ఠాగూరు

# విపుల

## పోటీల కూపను
## ఫిబ్రవరి 1987

7. రేగు : ఎగయు (ఎ), చెలరేగు (బి), పైకివచ్చు (సి), ఆగ్రహించు (డి).
8. లావు : బలము (ఎ), సామర్థ్యము (బి), ధైర్యము (సి), సాహసము (డి).

## ముఖచిత్రవ్యాఖ్య

ఆరు మాటలకు మించకుండా ఈ సంచిక చిత్రానికి తగిన శీర్షిక వ్రాసి పంపండి.

## పాఠకులఅభిప్రాయాలు

దైనందిన జీవితంలో మీకు ఎదురయ్యే ఏ సంఘటనను గురించి అయినా 15 మాటలకు మించకుండా చమత్కారమైన వ్యాఖ్య వ్రాసిపంపండి. ఉత్తమ వ్యాఖ్యకు రూ. 5 లు. ఖరీదుచేసే పుస్తకం బహుమతి!

## మీరైతే...?

"దేహంకంటే పవిత్రమైన దేవాలయం లేదు" అంటే మీరు ఏం చేస్తారు? క్లుప్తంగా చమత్కారంగా ఉండే జవాబు వ్రాయండి.

## భావపరిచయపోటీ





8 మాటలకు మించకుండా పైన కనిపిస్తున్న చిత్రాలను పరిశీలించి చమత్కారమైన లేదా ఆలోచన రేకెత్తించే శీర్షికను సూచించండి.

## వర్ధమాన దేశాలలో బ్రెజిలు విదేశీ అప్పులు అధికం

వర్ధమాన దేశాలన్నింటిలో దక్షిణ అమెరికా బ్రెజిలు విదేశీ ఋణాల మొత్తం చాలా అధికం_104 బిలియను డాలర్లని అంచనా వేయబడింది.

## దేదీప్యమానమైన జలయంత్రం

అమెరికా చికాగోలో గ్రాంట్ పార్కులో బకింగ్‌హామ్ మెమోరియల్ ఫౌంటెన్ ప్రపంచంలో కల్లా దేదీప్యమానం చేయబడిన విస్తృత జలయంత్రం. వివిధ వర్ణ కాంతులను ప్రసరించే విద్యుద్దీపాలు భూగర్భమందు ఒక గదిలో ఏర్పాటైన స్విచ్ బోర్డుపిల్ల నియంత్రింపబడుతున్నాయి.

"సత్యానికి సన్నిహితంగా జీవించినకొద్దీ మనుగడ ఆనందమయంగా రూపొందుతుంది."

# పోటీలు - ఫలితాలు

(డిసెంబరు 1986)

వ్యాసం - విజేతలు: - మొదటి బహుమతి: ఎమ్.కె. చక్రవర్తి, నరసరావుపేట (గుంటూరు జిల్లా); రెండవ బహుమతి: ఆర్. శ్రీనివాసరావు, తిరుపతి; మూడవ బహుమతి: ఎస్. శ్రీనివాస్, రామాయంపేట (మెదక్ జిల్లా).

క్విజ్ - జవాబులు: 1. (బి) బి.ఆర్. అంబేద్కర్, 2. (ఎ) సామాజిక ఆవశ్యకతలను గ్రహించువాడు, 3. (బి) విద్యుత్ పరిశ్రమ, 4. (బి) లివరు, 5. (ఎ) శుక్రుడు, 6. (బి) అణువిజ్ఞానం, 7. (ఇ) వాషింగ్టన్ D C. 8. (ఇ) సిలికాన్.

విజేతలు: మొదటి బహుమతి: షేక్ నజురుద్దీన్, హనుమాన్ జంక్షన్ (కృష్ణా జిల్లా); రెండవ బహుమతి: ఎస్.వి. నాగభూషణం, కడప; మూడవ బహుమతి: బి. మహేష్, కోట బొమ్మాళి (శ్రీకాకుళం జిల్లా).

పజిల్ - జవాబులు - అడ్డం: 1. తిరుపతి దివ్యక్షేత్రము, 6. మహాలయము కాదా, 8. కాలు. 9. రాట్నము, 10. తికమక, 11. దక్కను, 12. ముని, 14. మంచము, 15. మకుటం, 17. పంచదార, 18. మకరము.

నిలువు: 1. తిరుమలరాయ మంటపం, 2. పదిలముముదము, 3. పినము, 4. క్షేమదా, 5. ముడుపులు, 7. కాటుక, 8. కాకము, 10. తినుటకు, 13. నివాసము, 15. మర, 16. టంమ.

విజేతలు - మొదటి బహుమతి: ఎన్. ఝాన్సీలక్ష్మి, హైదరాబాద్; రెండవ బహుమతి: పుల్లాపంతుల వెంకట సుబ్బారావు, నరసాపురం; మూడవ బహుమతి; వేదుల ఇందిర, హైదరాబాద్.

తెలివికి పరీక్ష - జవాబులు: 1. 11 శ్లోకాలు, 2. బికారి ఆడది, 3. కృష్ణపక్షము, 4. 48 (ఇచ్చిన అంకెలకు వరుసగా 2, 4, 8, 16 కలుపగా), 5. 15 + 36 + 47 + 2 = 100, 6. కచటతపలు పరుషములు, గజడదబలు సరళములు, 7. 78 (మిగిలిన సంఖ్యలు వర్గములు). 8. మారేది (రూపాలు) అర్థం, మారనిది (పరమార్థం) అసలు వస్తుతత్త్వం.

## సూపర్ కంప్యూటర్

యునైటెడ్ స్టేట్స్, స్పేస్ (అంతరిక్ష) సంస్థ (Space Agency) మౌంటీన్ వ్యూలో ఆమ్స్ పరిశోధక సంస్థలో ఒక క్రొత్త అంతర్జాతీయ కేంద్రంలో సూపర్ కంప్యూటర్ (Cray - 2 Super Computer) ద్వారా పరిశోధనలు సాగిస్తున్నారు. ఇది ప్రపంచంలో అన్నిటినిమించిన అతి సమర్థవంతమైన కంప్యూటరు, ఇది సెకండుకి 250 మిలియను లెక్కలను గణిస్తుంది. దీంట్లో 30 శాతం పని గంటకు 27,360 కి. మీ. అధికవేగంతో ఎగిరే ఎయిరో స్పేస్‌లైనును రూపొందించి అభివృద్ధిచేయడానికి వినియోగపడుతుంది.

"శరీరంపొందడం అనేది లేకపోవడం మోక్షం—అంటారు వేదాంతులు
కర్మాచరణవల మోక్షసిది కలుగుతుందంటారు—మీమాంసకులు."

విజేతలు రెండవ బహుమతి: జి. డి. సన్యాసమ్మ, కళింగపట్నం; మూడవ బహుమతి: కుమారి సి. అపర్ణ తెనాలి.

**మాటల మహిమ - జవాబులు:** 1. భయము (ఎ). ధైర్యము (బి), ఉత్సాహము (సి), వివేకము (డి); 2. సహాయము(ఎ), కాగిన పాలు పెరుగు అగుటకు అందు చేర్చు మజ్జిగ (బి); 3. పరిహాసము (ఎ). ఆశ్చర్యము (బి). వింత (సి); 4. పీడించు(ఎ), ఆలస్యము (బి); 5. నిలువబడుట (ఎ), ప్రమాణము (బి). అంతస్థు (సి), ఎత్తు (డి); 6. బాధపడు (ఎ), శ్రమపడు (బి), మృతినొందు (సి); 7. అందము (ఎ), విలాసము (బి). శోభ (సి). రీతి (డి); 8. ఆందము (ఎ), పద్ధతి (బి). పని (సి), జాడ (డి).

**విజేతలు:** మొదటి బహుమతి: ఎమ్. ఎస్. సుబ్రహ్మణ్యం, తణుకు (ప. గో. జిల్లా); రెండవ బహుమతి: ఎన్. రూప్సిలక్ష్మి, హైదరాబాద్; మూడవ బహుమతి: ఎన్. వెంకటరెడ్డి, కవిటం (ప.గో. జిల్లా).

**ముఖచిత్రవ్యాఖ్య:** మొదటి బహుమతి: ఎమ్. జితేందర్, జూపల్లి. (మహబూబ్ నగర్ జిల్లా); రెండవ బహుమతి: ఎన్. కళ్యాణసుందర్, గుంటూరు.

**పాఠకుల అభిప్రాయాలు** రెండవ బహుమతి: తెంబూరుగానం, కొరసండ (గంజాం జిల్లా); మూడవ బహుమతి. వి. ఎస్ వి. రాజా, జేకేపూర్ (ఒరిస్సా).

**మీరైతే ?** మొదటి బహుమతి:జి.డి. సన్యాసమ్మ, కళింగపట్నం; రెండవ బహుమతి: పట్నాయకుని మోహన్ దాస్, కొత్తూరు (శ్రీకాకుళం జిల్లా); మూడవ బహుమతి: కిట్టోజు రఘురామ్, అజ్జరం (ప.గో. జిల్లా).

**భావపరిచయపోటి** రెండవ బహుమతి: వి. జగదీశ్, వరంగల్; మూడవ బహుమతి: తిరుమల విజయకుమార్, కరీంనగర్.

## ఇరాన్-ఇరాక్ యుద్ధంలో మిలియను మంది మరణించారు

1980 వ సం.రం సెప్టెంబరులో ప్రారంభమయిన ఇరాన్-ఇరాక్ యుద్ధ ఫలితంగా ఒక మిలియను మంది ప్రాణాలను కోల్పోయారు. రెండు దేశాలకు మొత్తం 60 బిలియను డాలర్ల నష్టం ఏర్పడింది. ఇంతే గాకుండా యుద్ధ సమయంలో మొదటి 18 మాసాలలోను నూనెమీద ఆదాయంలో చెరో దేశానికి 15 బిలియను డాలర్లు నష్టం ఏర్పడింది. మరణించిన మిలియను మంది లోను 7,00,000 మంది ఇరాను దేశానికి చెందినవారు.

(ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ డిఫెన్స్ స్టడీస్ అండ్ అనాలిసిస్ 'న్యూఢిల్లీ', సౌజన్యంతో)

"బహుదూరం ఎంతవరకూ చేరగలమో
తెలుసుకోవటమే చాతుర్యం, వివేకం." —జాన్ కాక్‌ట్యూ

EDITED, PRINTED AND PUBLISHED BY K V GOVINDA RAO
AT No 9, DESIKA ROAD, MYLAPORE, MADRAS-600 004 (INDIA)
PRINTED AT
*Desh Publications (P) Ltd. Madras-14 (Ph : 848084.*